

దశమహావిద్యలు - 3

# శ్రీ షోడశీ సాధన

జప - హోమ విధానం - స్తోత్రాలు - స్తుతులు

సంకలనం
డాక్టర్ జయంతి చక్రవర్తి

# దశమహావిద్యలు

సృష్టి స్థితిలయకారిణి అయిన ఆదిపరాశక్తి లోకాల్ని పాలించటానికి శ్రీదుర్గాదేవి, శ్రీలక్ష్మీదేవి, శ్రీసరస్వతీదేవి, శ్రీగాయత్రీదేవి, శ్రీరాధాదేవి అనే ఐదు అవతారాల్ని ధరించిందని, వీటినే పంచప్రకృతి స్వరూపాలంటారని బ్రహ్మావైవర్త మహాపురాణం చెబుతుంది. అలాగే ఇదే పురాణంలో జగన్మాత ఎన్నో అంశావతారాల్ని కూడా ధరించిందని చెప్పబడగా, శ్రీఆదిశక్తి అవతారాలు ఇంకా ఎన్నో వున్నట్లుగా వివిధ పురాణాలు పేర్కొంటున్నాయి. ఇలా జగన్మాత ధరించిన అన్ని రూపాల్లో "దశమహావిద్యలు" అనే పది రూపాలు ఎంతో విభిన్నమైనవిగా, విశిష్టమైనవిగా లోకంలో ప్రసిద్ధిపొందాయి. ఆసేతుశీతాచలం ఎందరో తంత్ర సాధకులు, దక్షిణాచార, వామాచార పద్ధతుల్లో తమతమ సంప్రదాయం ప్రకారం ఈ దశమహావిద్యల్ని ఉపాసిస్తూ ఆ దేవతల అనుగ్రహాన్ని పొందుతున్నారు. ఇంతటి ప్రఖ్యాతి కలిగిన ఈ దశమహావిద్యలు ఎవరు, ఎలా ఆవిర్భవించారు అన్న విషయాలు గురించి వివిధ పురాణాలు వివిధ రకాలుగా చెప్తాయి.

## దశమహావిద్యల ఆవిర్భవం

దశమహావిద్యలు ఎవరు? వారి పేర్లు ఏమిటి? అనే విషయం గురించి శాక్తసంగమ తంత్ర గ్రంథం ఇలా చెబుతుంది.

**కాళీ తారా మహావిద్యా షోడశీ భువనేశ్వరీ ।**
**భైరవీ ఛిన్న మస్తా చ విద్యాధూమావతీతథా ॥**
**బగళా సిద్ధ విద్యా చ మాతంగీ కమలాత్మికా ।**
**ఏతాఏవ మహావిద్యాః సిద్ధ విద్యాః ప్రకీర్తితాః ॥**

కాళీ, తార, షోడశీ, భువనేశ్వరీ, భైరవీ, ఛిన్నమస్తా, ధూమావతీ, బగళాముఖీ, మాతంగీ కమలాత్మికా. అనేవి దశమహావిద్యల నామాలు.

## శ్రీ దేవీభాగవతం

ఈ దశమహావిద్యల ఆవిర్భావం గురించి శ్రీ దేవీభాగవతంలో ఒక కథనం ఉంది. పూర్వం దుర్గముడనే రాక్షసుడు అన్నిలోకాల్ని ఆక్రమించి దేవతలందర్నీ స్వర్గంనుంచి తరిమేయగా, ఆ అసురుడి బాధలు భరించలేని దేవతలంతా జగన్మాతను చేరి ఆమెకి తమ కష్టాలన్నీ విన్నవించారు. వారి బాధలు విన్న జగన్మాత శాకాంబరిగా మారి ముందువారి ఆకలి బాధలు తీర్చింది. ఆ తరువాత లోకాల్ని కాపాడాలని దేవతల్ని ఉద్ధరించాలని దుర్గముడితో యుద్ధానికి ఉపక్రమించింది. దేవీ దుర్గముల మధ్య భయంకరంగా యుద్ధం కొనసాగుతున్న సమయంలో దేవి శరీరం నుంచి అకస్మాత్తుగా

**కాళికా తారిణీ బాలా త్రిపుర భైరవీ రమా ।**
**బగళాచైవ మాతంగీ తథా త్రిపుర సుందరీ ॥**
**కామాక్షీ తులజా దేవీ జంభినీ మోహినీ తథా ।**
**ఛిన్నమస్తా గుహ్యకాళీ దశసాహస్ర బాహుకా ॥**

కాళీ, తారా, బాలా, త్రిపుర భైరవి, రమా, బగళాముఖి, మాతంగి, త్రిపురసుందరి కామాక్షి, తులజాదేవి, జంభినీ, మోహినీ, ఛిన్నమస్తా, గుహ్యకాళీ, దశసాహస్ర బాహుకా అని పంచాదశ (15) శక్తులు ఆవిర్భవించాయని ఇందులో చెప్పబడిది.

## శివపురాణం

ఈ దశమహావిద్యల ఆవిర్భావ కథనాన్ని శివపురాణంలోని ఉమాసంహిత మరోలా వివరిస్తుంది.

**ఏతస్మిన్నంతరే తస్యాః శరీరాద్రమ్య మూర్తయః ।**
**కాళీ తారా ఛిన్నమస్తా శ్రీ విద్యా భువనేశ్వరీ ॥**

**భైరవీ బగళా ధూమ్రా శ్రీమత్త్రిపుర సుందరీ ।**
**మాతంగీ చ మహావిద్యా నిర్గత దశ సాయుధాః ॥**
**తతో మాతృగణైర్యుద్ధం ప్రావర్తత భయంకరం ।**

*(ఉమాసంహిత , శివపురాణం-అధ్యాయం 50)*

పూర్వం దక్షప్రజాపతి ఒక మహాయజ్ఞాన్ని నిర్వహిస్తూ ఆ యాగానికి, సమస్త దేవతల్ని ఆహ్వానించాడు గానీ, తన అల్లుడైన శంకరుణ్ణి, కూతురు సతీ దేవిని ఆహ్వానించలేదట. అయితే ఇతరుల ద్వారా తండ్రి చేస్తున్న యాగం గురించి తెల్సుకున్న సతీదేవి. ఆ యాగాన్ని చూడాలని కోరుకుంది. ఇందుకు శంకరుడు ఒప్పుకోలేదు. పిలవని కార్యానికి వెళ్ళటం మంచిది కాదు. అవమానం పాలవుతాం అని సతీదేవికి ఎంతో నచ్చచెప్పాడు. అయినా సతి వినలేదు. ఆమెకి ఎలాగైనా తండ్రి చేసే యాగం చూడాలన్న కాంక్ష మరింతగా పెరిగింది. శివ, సతీదేవిలిద్దరికీ మాటా మాటా పెరిగింది. అంతలో శివుడికి కోపం వచ్చి భయంకరమైన రూపాన్ని ధరించాడు. అదిచూసి సతీదేవికి కూడా బాగా కోపం కలిగి వెంటనే ఆమె కూడా మరింత ఉగ్రరూపిణిగా మారిపోయింది. అంతే లోకాలన్నింటినీ దహించేలా ఉన్న ఆ భయంకర కరాళమూర్తిని చూసి శివుడికి నోట మాటరాలేదు. సాక్షాత్తు లయకారుడైన శివుడే చాలా భయపడి అక్కణ్ణుంచి పారిపోదామని పరుగుదీసాడు.

అయితే సతీదేవి కరాళరూపం, శివుణ్ణి వదలదలుచుకోలేదు. వెంటనే తన భయంకర శరీరం నుంచి దశమహావిద్యల్ని ఆవిర్భవింపచేయగా ఆ పది మహావిద్యలు శివుడు ఎటూపారిపోకుండా పది దిక్కుల్లో ఆయన్ని అడ్డుకున్నాయి.

**ఏవం పతిం వీక్ష్య భయాభి భూతం ।**
**దయాన్వితా సాపతి వారణేచ్ఛయా ॥**
**సర్వాసుదిక్షు క్షణమగ్రతః స్థితా**
**తథా చ భూత్వ దశమూర్తయః పరా ॥**

**కాళీ తారా చ లోకేశీ కమలా భువనేశ్వరీ**
**ఛిన్నమస్తా చ షోడశీ చ సుందరీ బగళాముఖీ**
**ధూమావతీ మాతంగీ నామాన్యాసామిమానివై**

ఇలా తన కళ్ళముందు పదిరకాల మహాశక్తులు కనబడటంతో ఎటూ వెళ్ళలేని శివుడు. భయపడుతూ సతీదేవితో ఈ పదిశక్తులు ఎవరు అని ప్రశ్నించాడు. శివుడి పరిస్థితి చూసి జాలిపడి శాంతించిన సతీదేవి ఆయనతో ఓ పరమేశా మీ ఎదురుగా కృష్ణ వర్ణంతో నిల్చున్న మూర్తి కాళిక, మీ పైన నీలవర్ణంతో ప్రకాశించేది తార, మీకు పడమరగా తలలేకుండా కనిపిస్తున్నది ఛిన్నమస్త, మీకు ఎడమవైపు వున్నది భువనేశ్వరి, మీ వెనకాల నిల్చున్నది బగళాముఖి, మీకు ఆగ్నేయ దిక్కులో కనిపించేది ధూమావతి, నైరుతి దిశలో నిలబడింది త్రిపురసుందరి, వాయవ్య భాగంలో కనబడేది మాతంగి, ఈశాన్య భాగాన నిల్చుంది షోడశి, ఈ విషయాలు చెబుతున్న నేను భైరవిని. మీరు భయపడాల్సిన పనిలేదు. మీకు నా పూర్తి స్వరూపాల్ని దర్శింపచేయాలని ఇలా చేసాను. నా దివ్య శరీరం నుంచి ఉద్భవించిన ఈ దశ మహావిద్యలు ఎంతో గొప్పవి.

**భక్త్యా సంభజతాం నిత్యం చతుర్వర్గ ఫలప్రదాః ।**
**సర్వాభీష్ట ప్రదాయివ్యః సాధకానాం మహేశ్వర ॥**
**మారణోచ్ఛాటన క్షోభమోహన ద్రావణాని చ ।**
**వశ్య స్తంభవ విద్వేషాద్యభిప్రేతాని కుర్వతే ॥**

ఈ నా దివ్య స్వరూపాల్ని భక్తిపూర్వకంగా ఉపాసించేవారికి ధర్మ అర్థ కామమోక్షాలు లభిస్తాయి. మారణం, ఉచ్చాటనం, మోహనం, స్తంభనం, వశీకరణం, విద్వేషణం వంటి షట్కర్మలు ఈ మహావిద్యలు ద్వారా ప్రయోగించవచ్చు. అని శివుడికి చెప్పింది. ఇలా సతీదేవి ద్వారా దశమహావిద్యల గొప్పదనం లోకానికి తెలిసింది.

## దశమహావిద్యల ప్రశస్తి

శ్రీదేవీ భాగవతంలోని దశమస్కంధంలో భ్రామరీ రూపంలో అవతరించిన ఆదిపరాశక్తిని దేవతలంతా ముక్తకంఠంతో

**నమోదేవీ మహావిద్యే సృష్టిస్థిత్యంత కారిణీ ।**
**నమః కమలపత్రాక్షి సర్వాధారే నమోస్తుతే ॥**

జగన్మాతను "సృష్టిస్థితి సంహారకారిణివైన ఓ మహావిద్యా! కమలాల వంటి నేత్రాలతో ప్రకాశించే తల్లీ. ఈ జగత్తునంతా నీలోనే నిలుపుకున్న ఆదిశక్తీ ఓకాళీ, ఓ నీల సరస్వతి, ఓ తారాదేవి, ఓ త్రిపురసుందరీ, ఓ భైరవీ, మాతంగీ, ధూమావతీ, కమలాత్మికా, భువనేశ్వరీ, మమ్మల్ని అన్ని బాధలనుండీ రక్షించు అన్ని దిక్కులనుంచీ వచ్చే కష్టాల నుంచి కాపాడు భక్తితో చేసే మా ప్రణామాల్ని అందుకుని రక్షించు" అంటూ చేసే స్తోత్రంలో ఆదిపరాశక్తిని దశమహావిద్యా స్వరూపిణిగా కీర్తిస్తారు.

శ్రీదేవి భాగవతంలోని 12వ స్కంధంలో మణిద్వీపవర్ణన ఘట్టంలో ఆదిపరాశక్తి కొలువుండే మణిద్వీపంలోని నవరత్న ప్రాకారంలో...

**శ్రీ దేవ్యాఽ యే అవతారాః స్యుస్తే తత్ర ని వసంతి హి।**
**మహావిద్యా ప్రభేదాః సంతి తత్రైవ భూమిప ॥**

*(శ్లో॥ 106 దేవీభాగవతం - నవమ స్కంధం)*

మహావిద్యల అవతారాలన్నీ కొలువుదీర్చి అక్కడ నివాసం వుంటాయని చెప్పటం జరిగింది. దీనిని బట్టి చింతామణి ద్వీప నివాసిని అయిన ఆది పరాశక్తికి అత్యంత సమీపంలో నివసించేవి దశమహావిద్యలని తెలుస్తోంది. అందుకే దశమహావిద్యలకి ఇంత గొప్ప ప్రాముఖ్యత ఉపాసకుల లోకంలో కలిగింది.

ఈ విధంగా దశమహావిద్యల ఆవిర్భావంగురించి పురాణాల్లో విభిన్న రకాలుగా చెప్పబడగా, ఈ దశమహావిద్యల ఉపాసనల గురించి

మంత్రమహోదధి, మంత్రమహార్ణవం, శారదాతిలకం, వంటి సుప్రసిద్ధ తంత్ర గ్రంధాలు తెలియజేస్తున్నాయి. వీటిలో ఈ దశమహావిద్యల ఉపాసనాపద్ధతులు రెండు రకాలుగా చెప్పబడ్డాయి.

**1. ఉద్భవక్రమం** : దీని ప్రకారం దశమహావిద్యలలో మొదటిదైన శ్రీకాళీ మహావిద్యతో సాధన మొదలుపెట్టి చివరిదైన శ్రీకమలాత్మికా మహావిద్యతో సాధన ముగించటం.

**2. సంహారక్రమం** : దీని ప్రకారం సాధకుడు దశమహావిద్యల్లో చివరిదైన శ్రీకమలాత్మికా మహావిద్యతో తన సాధన ప్రారంభించి మొదటిదైన శ్రీకాళీ మహావిద్యతో సాధన పూర్తిచేయటం. ఈ సాధనల్లో గృహస్థులు ఉద్భవక్రమాన్ని, సన్యాసులు సంహార క్రమాన్ని ఆచరించాలి. ఈ దశమహావిద్యల్ని వామాచార దక్షిణాచార మార్గాల్లో ఉపాసించవచ్చు లేదా పగలు దక్షిణాచారం రాత్రి వామాచారం అనే పద్ధతిని కూడా అనుసరించవచ్చు. (శ్రీ రామకృష్ణపరమహంస ఇదే పద్ధతిలో కాళీసాధన చేసేవారట).

## వామాచారం

మద్య మాంస, మత్స్య ముద్ర, మైధునం అనే పంచ మకారాలతో చేసే సాధన వామాచార సాధన అని చెప్పబడుతుంది. సాధారణంగా కాళీ, తారా, భైరవి, ధూమావతి, ఛిన్నమస్తా, మాతంగి, బగళాముఖి వంటి దశమహావిద్యలని వామాచార పద్ధతిలో సాధన చేస్తేనే సిద్ధిస్తాయని తంత్ర గ్రంధాలు చెబుతాయి. అయితే గురువు పర్యవేక్షణలో, గురువు ఆదేశం లేకుండా ఈ విధమైన సాధన చేయటం చాలా ప్రమాదకరం అని సాధకులు తెలుసుకోవాలి.

## దక్షిణాచారం

సాధారణంగా సౌమ్య దేవతలందరినీ దక్షిణాచార పద్ధతిలో ఉపాసన చేస్తారు. దశమహావిద్యలలోని త్రిపురసుందరి, కమలాత్మిక, మాతంగి, దేవతల్ని దక్షిణాచార పద్ధతిలో ఉపాసించవచ్చు. ఈ పద్ధతిలో దేవతలకు ఇష్టమైన పూలు, పళ్ళు, వంటివి ఉపయోగిస్తు సాధన చేస్తారు. బలివిధానంలో – కూష్మాండ (గుమ్మడికాయ) బలి, లేదా నారికేళ బలి, ఎర్రాన్నము, నిమ్మకాయలు, కుంకుమ కలిపిన గారెలు, దేవతా ప్రీతికోసం బలిగా నివేదిస్తారు. ఇది సురక్షితమైన సాధన ఈ విధానంలో ఉగ్రదేవతల్ని కూడా సాధన చెయ్యవచ్చు కానీ అనుగ్రహం కాస్త ఆలస్యంగా లభించవచ్చు.

## పురశ్చరణకు తగిన ప్రదేశాలు

కాళీ, తారా, ఛిన్నమస్తా వంటి దశమహావిద్యల సాధనకు ఏకలింగం వున్న శివాలయాలు, శ్మశానాలు, నిర్జనమైన, అరణ్యాలు, గుహలు, యుద్ధభూములు, కంఠంలోతున నీళ్ళలో నిలబడగలిగిన నదులు. చాలా అనుకూలమైనవని మంత్రమహోదధిలో చెప్పగా, స్వగృహంలో చేసిన దానికంటే గోశాలలో పురశ్చరణచేస్తే పదిరెట్లు, అడవిలో చేస్తే వందరెట్లు, నదీతీరాల్లో వేయిరెట్లు, సముద్రతీరాల్లో లక్షరెట్లు, శివాలయాల్లో పదికోట్లరెట్టు గురువు సన్నిధిలో పురశ్చరణ చేస్తే వందకోట్ల రెట్లు అధికఫలం లభిస్తుందని బ్రహ్మయామళ తంత్ర గ్రంథం చెబుతుంది. కాబట్టి సాధకులు తమకు అనువైన పురశ్చరణా స్థలాన్ని ఎన్నుకుని సాధన కొనసాగించాలి.

## పంచాంగోపాసన

మంత్ర మహోదధిలో మంత్ర యోగ విశేషాలు గురించి చెప్పే సందర్భంలో ఒక దేవతా మంత్రం పరిపూర్ణంగా సిద్ధించటానికి 16 అంగాలు

ఆచరించాలని చెప్పటం జరిగింది. అవి 1. భక్తి 2. శుద్ధి 3. ఆసనం 4. పంచాంగసేవనం 5. ఆచారం 6. ధారణ 7. దివ్యదేశ సేవనం (తీర్థయాత్రలు చేయటం) 8. ప్రాణక్రియ 9. ముద్ర 10. తర్పణం 11. హవనం (హోమం చేయటం) 12. బలిదానం (నైవేద్యం) 13. యాగం 14. జపం 15. ధ్యానం 16. సమాధి అనేవి. అయితే అందరు సాధకులకి పై తెలిపిన 16 అంగాలను ఆచరించటం చాలా కష్ట సాధ్యం. కానీ శాస్త్రాన్ని అనుసరించాలి కదా. అందుకు పై వాటిలోని పంచాగ సేవనం అనే మంత్రయోగాంగం, ఆచరించటానికి కాస్త సులభంగా వుంటుంది కనుక పంచాంగ సేవన ద్వారా దేవతానుగ్రహం పొందవచ్చు.

## పంచాగ సేవనం

**గీతా సహస్ర నామాని స్తవః కవచమేవ చ ।**

**హృదయేతి పంచైతే పంచాంగం ప్రోచ్యతే బుధైః ॥**

మంత్రదేవతకు సంబంధించిన గీత - సహస్రనామాలు, స్తోత్రాలు (స్తుతులు) కవచం. హృదయం ఈ ఐదు పంచాంగాలుగా చెప్పబడ్డాయి. సాధకులు తమ ఇష్టదేవత మంత్రాన్ని జపం చేసిన తరువాత. పై తెలిపిన పంచాగాలని పఠిస్తే అది పంచాంగ సేవనంగా చెప్పబడుతుంది. దీని ద్వారా మంత్రాధి దేవత సంతోషించి సాధకుడికి త్వరగా మంత్ర సిద్ధి కలిగేలా చేస్తుంది. అందుకనే మంత్ర మహోదధి మంత్ర మహార్ణవాది గ్రంథాల్లో చెప్పబడిన పంచాంగ సేవనంలోని అంశాలని సేకరించి ఈ గ్రంథంలో మీకందిస్తున్నాం. సాధకులు వీటిని మంత్ర జపానంతరం పఠించి దేవతానుగ్రహం పొందవలసిందిగా మనవి.

## మంత్ర సిద్ధిలక్షణం

కొన్ని ప్రత్యేక లక్షణాలు సాధకుడు తనలో కలగటాన్ని గమనించటం ద్వారా తను ఉపాసించే మంత్రం సిద్ధించిందా లేదా అని స్వయంగా తెలుసుకోవచ్చు. ఎప్పుడైతే సాధకుడు మంత్రాన్ని మంత్రాధి దేవతని, తన మనస్సుని ఏకంచేసి నిష్ఠగా జపం చేస్తాడో అప్పుడు అతనికి శరీరం రోమాంచితం అవుతుంది. కళ్ళవెంబడి నీళ్ళు వస్తాయి. చివరికి తన ఆత్మ మంత్రం ద్వారా పరమాత్మలోలీనమై సమాధి స్థితి ఏర్పడుతుంది. ఇలాంటి స్థితి కలిగినప్పుడే తనకు మంత్రసిద్ధి అయిందని సాధకులు గుర్తించాలి. ఇటువంటి స్థితి లభించటం అంత సులభంకాదు కనుక మరోసారి మరోసారి శాస్త్రంలో చెప్పిన విధంగా పురశ్చరణలు ఆచరించాలి.

## దశమహావిద్యలకు ఇష్టమైన తిథులు

| | | | |
|---|---|---|---|
| 1. కాళీ | - ఆశ్వయుజ కృష్ణ అష్టమి | 6. ధూమావతి | - జ్యేష్ఠ శుక్ల అష్టమి |
| 2. తారా | - చైత్రశుక్ల నవమి | 7. భువనేశ్వరి | - భాద్రపద శుక్ల అష్టమి |
| 3. ఛిన్నమస్తా | - వైశాఖశుక్ల చతుర్దశి | 8. షోడశి | - మార్గశీర్ష పూర్ణిమ |
| 4. బగళాముఖి | - వైశాఖ శుక్ల అష్టమి | 9. కమలాత్మికా | - మార్గశీర్ష అమావాస్య |
| 5. మాతంగి | - వైశాఖ శుక్ల తదియ | 10. భైరవి | - మాఘపూర్ణిమ |

ఈ తిథుల్ని దశమహావిద్యల జన్మతిథులుగా కొన్ని గ్రంథాల్లో చెబుతున్నారు. పురాణ కథనాల్ని పరిశీలిస్తే దశమహావిద్యలన్నీ ఒకేసారి ఆవిర్భవించినట్టుగా తెలుస్తోంది. కాబట్టి పై తెలిపిన తిథుల్ని జన్మతిథులుగా కాకుండా దశమహావిద్యలకి ప్రీతిపాత్రమైన తిథులుగా మనం భావించవచ్చు.

సాధకులు ఈ మహావిద్యలకు ఇష్టమైన తిథులలో జప, హోమాలను నిర్వర్తిస్తే ఆ దేవతానుగ్రహం వారికి సత్వరం లభిస్తుంది.





# దశ మహావిద్యలు



కృష్ణవర్ణంతో ప్రకాశించే **శ్రీకాళీదేవి** దశమహావిద్యలలో మొదటి మహావిద్య, ఆశ్వయుజమాసం కృష్ణపక్ష అష్టమీతిథి ఈ దేవికి ప్రీతిపాత్రమైనది. కాలస్వరూపిణిగా ఖ్యాతిపొందిన శ్రీకాళీదేవి ఉపాసన ఎంతో ఉత్కృష్టమైనదిగా శాక్తేయసంప్రదాయంలో చెప్పబడింది. తంత్రోక్త మార్గంలో శ్రీకాళీ మహావిద్యని ఆరాధిస్తే సకలరోగాలనుంచి, బాధలనుంచి విముక్తి, శత్రునాశనం, దీర్ఘాయువు, సకలలోక పూజత్వం సాధకుడికి లభిస్తుంది.



దశమహావిద్యలలో రెండవమహావిద్య **శ్రీతారాదేవి**. నీలవర్ణంతో భాసించే ఈదేవికి చైత్రమాసం శుక్లపక్ష నవమితిథి ప్రీతిపాత్రమైనది. శ్రీతారాదేవి వాక్కుకి అధిదేవత. ఈమెనే నీలసరస్వతి అనికూడా అంటారు. తారాదేవి సాధనవల్ల వాక్సిద్ధి, శత్రునాశనం, దివ్యజ్ఞానం, ఐశ్వర్యం, కష్టనివారణ సాధకుడికి కలుగుతుంది.



అరుణారుణ వర్ణంతో ప్రకాశించే **శ్రీ షోడశీదేవి** దశమహావిద్యలలో మూడవ మహావిద్యగా ప్రసిద్ధిపొందింది. పరమశాంతి స్వరూపిణి అయిన ఈ దేవికి మార్గశిరమాస పూర్ణిమాతిథి ప్రీతిపాత్రమైనది. ఈ తల్లినే లలిత అని, రాజరాజేశ్వరి అని, మహాత్రిపురసుందరి అని అంటారు. ఎంతో మహిమాన్వితమైన ఈ మహావిద్యని ఉపాసిస్తే ఆసాధకుడికి అన్నిరకాల కష్టనష్టాలనుంచి విముక్తి,మానసికశాంతి, భోగం, మోక్షం కలుగుతాయి.



దశమహావిద్యలలో నాల్గవ మహావిద్య **శ్రీ భువనేశ్వరీదేవి**. ఉదయించే సూర్యుడిలాంటి కాంతితో ప్రకాశించే ఈ దేవికి భాద్రపద శుక్లపక్ష అష్టమీతిథి ప్రీతిపాత్రమైనది. ఈ దేవి సంపూర్ణ సౌమ్యస్వరూపిణి. ఈ దేవిని ఉపాసించే సాధకుడికి మూడోకన్ను తెరుచుకుంటుంది. భూత భవిష్యత్ వర్తమానాలు తెలుసుకునే శక్తి లభిస్తుంది. అంతేకాదు, రాజ్యాధికారాన్ని సమస్తసిద్ధుల్ని, సకల సుఖభోగాల్ని ఈదేవి అనుగ్రహంతో సాధకులు పొందవచ్చు.



వేలసూర్యులకాంతితో ప్రకాశించే **శ్రీ త్రిపురభైరవీదేవి** దశమహావిద్యలలో ఐదవ మహావిద్య. ఈ దివ్యశక్తి స్వరూపిణికి మాఘమాసం పూర్ణిమాతిథి ప్రీతిపాత్రమైనది. ఆర్తత్రాణ పరాయణి అయిన ఈ మహావిద్యని ఆరాధిస్తే వివిధ సంకటాలనుంచి, బాధలనుంచి విముక్తి, సకల సుఖభోగాలను పొందేశక్తి, సకల జనాకర్షణ, సర్వత్రా ఉత్కర్షప్రాప్తి సాధకుడికి కలుగుతుంది.

## దశ మహావిద్యలు



దశమహావిద్యలలో ఆరవ మహావిద్య **శ్రీ ఛిన్నమస్తాదేవి.** ఈ దేవినే వజ్ర వైరోచినీ, ప్రచండచండీ అనికూడా అంటారు. వైశాఖమాసం శుక్లపక్ష చతుర్థి తిథి ఈ దేవికి ప్రీతిపాత్రమైనది. శాక్తేయ సంప్రదాయంలో ఛిన్నమస్తాదేవికి ఎంతో ప్రశస్తివుంది. ఈ దేవిని నిష్ఠతో ఉపాసిస్తే సరస్వతీ సిద్ధి, శత్రువిజయం, రాజ్యప్రాప్తి, పూర్వజన్మ పాపాలనుంచి విముక్తి లభిస్తుంది. అంతేకాదు, ఎటువంటి కష్టతరమైన కార్యాలనైనా అవలీలగా సాధించేశక్తి ఈదేవి ప్రసాదిస్తుంది.

---



ధూమవర్ణంతో దర్శనమిచ్చే **శ్రీ ధూమవతీ దేవి** దశమహావిద్యలలో ఏడవ మహావిద్య. జ్యేష్ఠమాసం శుక్లపక్ష అష్టమీతిథి ఈ దేవికి ప్రీతిపాత్రమైనది. ఈ దేవతకి ఉచ్చాటనదేవత అనిపేరు. తన ఉపాసకుల కష్టాల్ని, దరిద్రాల్ని ఉచ్చాటనచేసి అపారమైన ఐశ్వర్యాన్ని ప్రసాదిస్తుంది. ఈ ధూమవతీదేవి ఆరాధనవల్ల సాధకుడికి వివిధ రోగాలనుంచి, శోకాలనుంచి విముక్తి కలుగుతుంది.

---



పీత (పసుపు) వర్ణంతో ప్రకాశించే **శ్రీ బగళాముఖీదేవి** దశమహావిద్యలలో ఎనిమిదో మహావిద్య. స్తంభనదేవతగా ప్రసిద్ధి పొందిన ఈమహాదేవికి వైశాఖమాస శుక్లపక్ష అష్టమీతిథి ప్రీతిపాత్రమైనది. ఈ దేవతా ఉపాసన వల్ల సాధకుడికి శత్రువుల వాక్కుని స్తంభింపచేసే శక్తి లభిస్తుంది. ముఖ్యంగా కోర్టు వ్యవహారాల్లో, వాదప్రతివాద విషయాల్లో ఎదుటి పక్షం వారి మాటల్ని స్తంభింపచేసి వ్యవహార విజయాన్ని సాధకులకు ప్రసాదిస్తుంది.

---



మరకతశ్యామ వర్ణంతో ప్రకాశించే **శ్రీ మాతంగీదేవి** దశమహావిద్యలలో తొమ్మిదవ మహావిద్య. వశీకరణదేవతగా ప్రశస్తి పొందిన మాతంగీదేవికి వైశాఖమాసం శుక్లపక్ష తృతీయాతిథి ప్రీతిపాత్రమైనది. రాజమాతంగీ, లఘుశ్యామలా, ఉచ్ఛిష్టచండాలి, అనే పేర్లతో కూడా ఈదేవిని వ్యవహరిస్తారు. ఈదివ్య స్వరూపిణి ఉపాసనవల్ల వాక్సిద్ధి, సకల రాజ స్త్రీ పురుష వశీకరణాశక్తి, ఐశ్వర్యప్రాప్తి సాధకుడికి లభిస్తాయి.

---



పద్మాసనాసీనయై స్వర్ణకాంతులతో ప్రకాశించే **శ్రీ కమలాత్మికాదేవి** దశమహావిద్యలలో పదవమహావిద్యగా ప్రశస్తిపొందింది. సకలైశ్వర్య ప్రదాయిని అయిన ఈదేవికి మార్గశిర అమావాస్యతిథి ప్రీతిపాత్రమైనది. కమలాత్మిక అంటే లక్ష్మీస్వరూపిణి అని అర్థం. శాంత స్వరూపిణి అయిన ఈ మహావిద్యని ఉపాసిస్తే సకలవిధ సంపదల్ని, పుత్రపౌత్రాభివృద్ధిని, సుఖసంతోషాల్ని సాధకుడికి శ్రీ కమలాత్మికాదేవి ప్రసాదిస్తుంది.

## ముండ మాలా తంత్రోక్త మహావిద్యా స్తోత్రం

నమస్తే చండికే చండి చండముండ వినాశిని ।
నమస్తే కాలికే కాల మహా భయానాశిని ॥ 1

శివే రక్ష జగద్ధాత్రి ప్రసీద హరవల్లభే ।
ప్రణమామి జగద్ధాత్రి జగత్పాలనకారిణీమ్ ॥ 2

జగత్క్షోభ కరీంవిద్యాం జగత్సృష్టి విదాయినీమ్ ।
కరాళీ వికటాం ఘోరాం ముండమాలా విభూషితామ్ ॥ 3

హరార్చితాం హరారాధ్యాం నమామి హర వల్లభామ్ ।
గౌరీం గురు ప్రియాం గౌరవర్ణాలంకార భూషితామ్ ॥ 4

హర ప్రియాం మహా మాయాం నమామి బ్రహ్మ పూజితామ్ ।
సిద్ధాం సిద్ధేశ్వరీం సిద్ధ విద్యాధరగణైర్యుతామ్ ॥ 5

మంత్ర సిద్ధిప్రదాం యోనిం సిద్ధిదాం లింగ శోభితాం ।
ప్రణమామి మహామాయాం దుర్గాం దుర్గతి నాశినీమ్ ॥ 6

ఉగ్రాముగ్రమయీ ముగ్రతారాముగ్రగణైర్యుతామ్ ।
నీలాం నీలఘనశ్యామాం నమామి నీలసుందరీమ్ ॥ 7

శ్యామాంగీం శ్యామ ఘటితాం శ్యామవర్ణ విభూషితామ్ ।
ప్రణమామి జగద్ధాత్రీం గౌరీం సర్వార్థ సాధినీమ్ ॥ 8

విశ్వేశ్వరీం మహా ఘోరాం వికటాం ఘోరనాదినీమ్ ।
ఆద్యా మాద్య గురోరాద్యామాద్యనాథ ప్రపూజితామ్ ॥ 9

శ్రీదుర్గాం ధనదామన్నపూర్ణాం పద్మాం సురేశ్వరీమ్ ।
ప్రణమామి జగద్ధాత్రీమ్ చంద్రశేఖర వల్లభామ్ ॥ 10

త్రిపురాం సుందరీం బాలామబలాగణ భూషితామ్ ।
శివదూతీం శివారాధ్యాం శివధ్యేయాం సనాతనీం ॥ 11

సుందరీం తారిణీం సర్వ శివాగణ భూషితామ్ ।
నారాయణీం విష్ణు పూజ్యాం బ్రహ్మ విష్ణు హర ప్రియామ్ ॥ 12

సర్వసిద్ధి ప్రదాం నిత్యామనిత్యాం గుణ వర్జితామ్ ।
సగుణాం నిర్గుణాం ధ్యేయా మర్చితాం సర్వసిద్ధిదామ్ ॥ 13

విద్యాం సిద్ధి ప్రదాం మహావిద్యాం మహేశ్వరీమ్ ।
మహేశ భక్తాం మాహేశం మహాకాల ప్రపూజితామ్ ॥ 14

ప్రణమామి జగద్ధాత్రీం శుంభాసురమర్ధినీమ్ ।
రక్త ప్రియాం రక్త వర్ణాం రక్తబీజవిమర్ధినీమ్ ॥ 15

భైరవీం భువనాం దేవీం లోల జిహ్వాం సురేశ్వరీం ।
చతుర్భుజాం దశభుజా మష్టాదశభుజాం శుభామ్ ॥ 16

త్రిపురేశీం విశ్వనాథ ప్రియాం విశ్వేశ్వరీం శివామ్ ।
అట్టహాసామట్టహాస ప్రియాం ధూమ్ర వినాశినీమ్ ॥ 17

కమలాం ఛిన్న భాలాం చ మాతంగీం సురసుందరీమ్ ।
షోడశీం విజయాం భీమాం ధూమాం చ బగళాముఖీం ॥ 18

సర్వసిద్ధిప్రదాం సర్వవిద్యా మంత్ర విశోధినీమ్ ।
ప్రణమామి జగత్తారాం సారాం చ మంత్ర సిద్ధయే ॥ 19

ఇత్యేవం చ వరారోహే స్తోత్రం సిద్ధికరం పరమ్ ।
పఠిత్వా మోక్షమాప్నోతి సత్యంవై గిరినందిని ॥ 20

## **మహావిద్యానామ నిరుక్తి** (కుబ్జికా తంత్రం)

కలౌకృష్ణత్వ మాసాద్య శుక్లాపి నీలరూపిణీ ।
లీలయా వాక్ప్రదా చేతి తేన నీల సరస్వతీ ॥ 1

తారకత్వాత్ సదా తారా తారిణీ చ ప్రకీర్తితా ।
భువనానాం పాలకత్వాత్ భువనేశీ ప్రకీర్తితా ॥ 2

సృష్టి స్థితికరీ దేవీ భువనేశీ ప్రకీర్తితా ।
నిర్గుణా చ మహాదేవీ షోడశీ పరికీర్తితా ॥ 3

భైరవీ దుఃఖ సంహర్త్రీ యమ దుఃఖవినాశినీ ।
కాలభైరవ భార్యా చ భైరవీ పరికీర్తితా ॥ 4

త్రిశక్తి కాలదా దేవీ ఛిన్నా చైవంసురేశ్వరీ ।
త్రిగుణా చ మహాదేవీ మోహినీ మోక్షదా ధ్రువమ్ ॥ 5

ధూమావతీ మహామాయా ధూమ్రాసుర నిఘాదినీ ।
ధూమరూపా మహాదేవీ చతుర్వర్గ ప్రదాయినీ ॥ 6

జగన్మాతా జగద్ధాత్రీ జగతాముపకారిణీ ।
వకారే వారుణీ దేవీ గకారే సిద్ధికా స్మృతా ॥ 7

లకారే పృథివీ చైవ చైతన్యాయా ప్రకీర్తితా ।
మాతంగీ మదశీలత్వాన్మాతంగాసురనాశినీ ॥ 8

సర్వాపత్తారిణీదేవీ మాతంగీ పరికీర్తితా ।
వైకుంఠ వాసినీ దేవీ కమలా చ ప్రకీర్తితా ॥ 9

పాతాళ వాసినీ దేవీ లక్ష్మీ రూపా చ సుందరీ ।
ఏతాదృశ మహావిద్యాః సిద్ధవిద్యా ప్రకీర్తితాః ॥ 10



## దశమహావిద్యా సంపూర్ణ కవచం

ఓం ప్రాచ్యాంరక్షతు మే తారా కామరూప నివాసినీ ।
ఆగ్నేయ్యాం షోడశీ పాతు యామ్యాం ధూమావతీ స్వయం ॥ 1

నైరృత్యాం భైరవీ పాతు వారుణ్యాం భువనేశ్వరీ ।
వాయవ్యాం సతతం పాతు ఛిన్నమస్తా మహేశ్వరీ ॥ 2

కౌబేర్యాం పాతు మే దేవి శ్రీవిద్యా బగళాముఖీ ।
ఐశాన్యాం పాతు మేదేవి మహాత్రిపుర సుందరీ ॥ 3

ఊర్ధ్వం రక్షతు మే విద్యా మాతంగీ పీఠవాసినీ ।
సర్వతః పాతుమేనిత్యం కామాక్షీ కాళికా స్వయం ॥ 4

బ్రహ్మరూపా మహావిద్యా సర్వ విద్యామయీ స్వయం ।
శీర్షం రక్షతు మే దుర్గా భాలం శ్రీ భవగేహినీ ॥ 5

త్రిపురా భ్రూయుగే పాతు శర్వాణీపాతు నాసికాం ।
చక్షుషీం చండికా పాతు శ్రోత్రే నీలసరస్వతీ ॥ 6

ముఖం సౌమ్యముఖీ పాతు గ్రీవాం రక్షతు పార్వతీ ।
జిహ్వాం రక్షతు మే దేవీ జిహ్వా లలన భీషణా ॥ 7

వాగ్దేవీ వదనం పాతు వక్షః పాతు మహేశ్వరీ ।
బాహూం మహాభుజా పాతు కరాంగులీః సురేశ్వరీ ॥ 8

పృష్ఠతః పాతు భీమాస్యా కట్యాం దేవీ దిగంబరీ ।
ఉదరం పాతు మే నిత్యం మహావిద్యా మహోదరీ ॥ 9

ఉగ్రతారా మహాదేవీ జంఘోరూ పరిరక్షతు ।
గుదం ముష్కం చ మేఢ్రం చ నాభిం చ సురసుందరీ ॥ 10

పదాంగులీః సదా పాతు భవానీ త్రిదశేశ్వరీ ।
రక్త మాంసాస్థి మజ్జాదీన్ పాతు దేవీ శవాసనా ॥ 11

మహా భయేషు ఘోరేషు మహాభయ నివారిణీ ।
పాతు దేవీ మహా మాయా కామాఖ్యా పీఠవాసినీ ॥ 12

రక్షాహీనం తు యత్థానం కవచేనాఽ పి వర్జితమ్।
తత్సర్వం సర్వదాపాతు సర్వ రక్షణ కారినీ ॥ 13

## ముండమాలా తంత్రోక్త మహావిద్యా కవచం

సదాశివ ఋషిర్దేవి। ఉష్ణిక్ఛంద ఉదీరితమ్ ।
వినియోగశ్చ దేవేశీ సతతం మంత్రసిద్ధయే ॥ 1

మస్తకం పార్వతీ పాతు పంచానన ప్రియా ।
కేశం ముఖం పాతు చండీ భారతీ రుధిర ప్రియా ॥ 2

కంఠం పాతు స్తనం పాతు కపాలం పాతు చైవహి ।
కాళీ కరాళ వదనా విచిత్రా చిత్ర ఘష్టినీ ॥ 3

వక్షోమూలం నాభీ మూలం దుర్గా త్రిపురసుందరీ ।
సమస్తం పాతు మే తారా సర్వాంగీ సర్వ మేవ చ ॥ 4

విశ్వేశ్వరీ పృష్ఠ దేశం నేత్రం పాతు మహేశ్వరీ ।
హృత్పద్మం కాళికా పాతు కంఠం పాతు నభోగతమ్ ॥ 5

నారాయణీ గుహ్యదేశం మేఢ్రం మేఢ్రేశ్వరీ తథా ।
పాదయుగ్మం జయా పాతు నిత్యం మాం చండికావతు ॥ 6

జీవం మాం పార్వతీ పాతు మాతంగీ పాతు సర్వదా ।
ఛిన్నా ధూమా చ భీమా చ భయే పాతు జలే వనే ॥ 7

కౌమారీ చైవ వారాహీ నారసింహీ యశోమమ ।
పాతు నిత్యం భద్రకాళీ శ్మశానాలయ వాసినీ ॥ 8

ఉదరే సర్వదా పాతు శర్వాణీ సర్వ మంగళా ।
జగన్మాతా జయం పాతు నిత్యం కైలాస వాసినీ ॥ 9

శివ ప్రియా సుతాం పాతు సుతం పర్వత నందినీ ।
త్రైలోక్యం పాతు బగళా భువనం భువనేశ్వరీ ॥ 10

సర్వాం సర్వనిలయా పాతు నిత్యం చ పార్వతీ ।
చాముండా పాతు మే రోమకూపం సర్వార్థ సాధనా ॥ 11

బ్రహ్మాండం మే మహావిద్యా పాతు నిత్యం మనోహరా ।
లింగం లింగేశ్వరీ పాతు మహాపీఠే మహేశ్వరీ ॥ 12

సదా శివ ప్రియా పాతు నిత్యం పాతు సురేశ్వరీ ।
గౌరీ మే సంధి దేశం చ పాతు వై త్రిపురేశ్వరీ ॥ 13

సురేశ్వరీ సదా పాతు శ్మశానే చ శివేఽవతు ।
కుంభకే రేచకే చైవ పూరకే కామ మందిరే ॥ 14

కామాఖ్యా కామనిలయం పాతు దుర్గా మహేశ్వరీ ।
డాకినీ కాకినీ పాతు నిత్యం మే శాకినీ తథా ॥ 15

హాకినీ లాకినీ పాతు రాకినీ పాతు సర్వదా ।
జ్వాలా ముఖీ సదాపాతు ముఖ మధ్యే శివాఽవతు ॥ 16

తారిణీ విభవే పాతు భవానీ చ భవేఽవతు ।
త్రైలోక్య మోహినీ పాతు సర్వాంగం విజనేఽవతు ॥ 17

రాజకులే మహాఘాతే సంగ్రామే శత్రుసంకటే ।
ప్రచండా సాధకీ పాతు రాజద్వారే విపత్తిషు ॥ 18

సంపత్ప్రదా భైరవీ చ పాతు బాలా బలం మమ ।
నిత్యం మాం శంభువనితా పాతు మాంత్రిపురాంతకా ॥ 19

ఇత్యేవం కథితందేవీ రహస్యం సర్వకాలికమ్ ।
భుక్తిదం ముక్తిదం సౌఖ్య సర్వ సంపత్ప్రదాయకమ్ ॥ 20

ఏవం యది వరారోహే పఠేత్ భక్తి పరాయణః ।
మంత్ర సిద్ధి ర్భవేత్తస్య చాచిరాన్నాత్ర సంశయః ॥ 21

## దశమహావిద్యాస్తుతి

**ఉమా సహస్రం**

1. త్వం సుందరీ నృపతి జాతి జతస్త్వమంబా
ధూమావతీ త్వమజరే ! భువనేశ్వరీ త్వమ్ ।
కాళిత్వమీశ్వరి ! శుకార్భకధారిణీత్వం
తారా త్వమాశ్రిత విపద్దలనాసిధారా ॥

2. త్వం భైరవీ భగవతీ బగళాముఖీ త్వం ।
రమా చ సా కమలకాననచారిణీ త్వమ్ ॥
కైలాసవాసి నయనామృత భానురేఖే ।
కో వేదతే జనని ! జన్మవతాం విభూతీః ॥

(శ్లో॥ 23 - 24, స్తబకం 28, ఉమాసహస్రం)

**భావం:**

అమ్మ జగన్మాతా నీవే త్రిపుర సుందరివి, సాక్షాత్ శ్రీ విద్యారూపిణివి, పరశురాముడి తల్లి అయిన ఛిన్నమస్తకా రేణకాదేవివీ నీవే, వార్ధక్యమేలేని ధూమ్రవారాహివి ధూమావతివి నీవే, సర్వేశ్వరివైన నీవే భువనేశ్వరివి, దక్షిణకాళిగా కొలిచే కాళివీ నీవే, పసిచిలుక చేతిలో ఉంచుకున్న మాతంగివీ నీవే, ఆశ్రితుల ఆపదల్ని పోగొట్టే తారాదేవివి నీవే.

త్రిపుర భైరవిగా కీర్తించబడేదానివి. స్తంభనకరివైన బగళాముఖివి, పద్మవన వాసినివైన కమలాత్మికవి, శివుడి కళ్ళకు, అమృత కిరణాలతో ప్రకాశించే చంద్రుడిలాగా ఆనందాన్నిచ్చే తల్లీ నీదివ్య ఐశ్వర్య విభవాన్ని ఎవడు తెలుసుకోగలడు.

కావ్య కంఠ వాసిష్ఠ గణపతిముని



## శ్రీ షోడశీ (త్రిపురసుందరి) మహావిద్య

**అరుణాకరుణాంతరంగితాక్షీం ధృతపాశాంకుశ పుష్పబాణచాపాం ।**
**అణిమాదిభిరావృతాం మయూఖైః అహమిత్యేవ విభావయే భవానీమ్ ॥**

కరుణారసభరితమైన చూపులతో, తన దివ్య శరీరం నుంచి అణిమాది అష్ట సిద్ధుల్ని కాంతి కిరణాల రూపంలో ప్రకాశింపచేస్తూ, పాశం, అంకుశం, చెరకువిల్లు, పూలబాణాల్ని తన నాలుగు చేతుల్లో ధరించి, ఎర్రని వర్ణంతో ప్రకాశిస్తూ దర్శనమిచ్చే శ్రీ భవానీ దేవిని భావిస్తున్నాను.

దశమహావిద్యలలో మూడవ మహావిద్య శ్రీ త్రిపుర సుందరీదేవి. ఈ దేవినే షోడశీ అని కూడా అంటారు. ప్రాచీన కాలంలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులచేత అర్చించబడింది కాబట్టి

**బ్రహ్మావిష్ణు మహేశాద్యై స్త్రిదశైరర్చితా పురా ।**
**త్రిపురేతి సదానామ కథితం దైవతైస్తవ ॥**

ఈ దేవి త్రిపురగా ప్రసిద్ధి చెందిందని వారాహి తంత్రంలో చెప్పగా త్రిపురారి అయిన శివుడి భార్య కనుక ఈమె త్రిపుర సుందరి అని కాళికాపురాణం తెలుపుతుంది.

త్రిపుర సుందరి అంటే ? మూడు పురాలలో అందరికన్నా అత్యంత సౌందర్యం కలిగింది అని. అసలు త్రిపురాలు అంటే ? 1. సూర్య మండలం 2. చంద్ర మండలం 3. అగ్ని మండలం లేదా కొందరి భావనలో ఆకాశ మండలం. ఇలా ఈ మూడు పురాలలోకీ గొప్ప సౌందర్యం కలిగిన సుందరిగా, త్రిపుర సుందరిని భావిస్తారు. మరి కొందరు త్రిపురాలు అనేవి వేరే ఎక్కడో లేవని అవి మన శరీరంలోని 1. చక్షువులు (కళ్ళు) 2. శిరస్సు (తల) 3. హృదయం (మనస్సు) ఈ మూడు భాగాలే మూడు పురాలని, జ్ఞానకళా స్వరూపిణైన త్రిపురసుందరి మన శరీరంలోని ఈ మూడు పురాలలో స్థాపితమై ఉంటుందని చెబుతారు. ఈ విషయాన్నే స్పష్టపరుస్తూ 1. ఫాలస్థా ఇంద్ర ధనుః ప్రభా 2. శిరస్థితా చంద్రనిభా 3. హృదయస్థా రవిప్రఖ్యా అని లలితా సహస్రనామ స్తోత్రం పేర్కొంటుంది.

జగద్గురు ఆదిశంకరాచార్యుల వారు తమ సౌందర్యలహరిలో అత్యంత సౌందర్యవతిగా జగన్మాతైన శ్రీ త్రిపురసుందరిని ఎంతో విశేషంగా కీర్తిస్తారు. అలాగే కాళీ వర ప్రసాదుడైన శ్రీరామకృష్ణ పరమహంస కూడా కాళీ సాధనలో పరిపూర్ణత్వాన్ని సాధించి, ఆ తరువాత ఎందరో దేవతలను ఉపాసించి, తను దర్శించిన దేవతల్లో శ్రీ త్రిపుర సుందరిని మించిన సౌందర్యదేవి వేరేదీ లేదని తమ దర్శనానుభవాన్ని చెప్పారు. కుర్తాళ శ్రీ సిద్ధేశ్వరీ పీఠాధిపతులు జగద్గురు శ్రీ సిద్ధేశ్వరానంద భారతీ స్వామివారు కూడా తమ శిష్యురాలికి శ్రీ త్రిపుర సుందరీ మంత్రోపదేశం చేసిన సందర్భంలో ఆ దేవత ఆ స్త్రీమూర్తిలో ఆవేశించి అతి సుందరమైన దరహాసాన్ని చేయగా, ఆ అద్భుత దృశ్యాన్ని చూసి ఆనంద హృదయంతో స్పందించిన స్వామి వారు –

**వాదని భక్తితోడ ఒక భామిని వేదగ దివ్యమంత్రమా**
**మ్రేడిత రీతి పల్కగ మేను విలక్షణ కంపమొందు ఆ**
**చేడియ నావహించి వివశీకరణాద్భుత మందహాసయౌ**
**షోడశికిన్ మహాత్రిపుర సుందరికిన్ మనసార మ్రొక్కెదన్.**

అని త్రిపుర సుందరీ దేవిని గురించి ఆశువుగా పద్యాన్ని ఆలపించారు.

ఇంతటి సౌందర్య రూపిణైన త్రిపుర సుందరిని – షోడశీ అని, బాలా త్రిపుర సుందరి అని, లలితా త్రిపుర సుందరి అని, శ్రీ రాజరాజేశ్వరీదేవి అని, శ్రీ లలితా దేవి అని కూడా వ్యవహరిస్తారు. ఈ దేవి నివాస స్థానం నవావరణ పరివేష్టితమైన శ్రీ చక్రం. ఈ శ్రీచక్రపురంలోని దివ్య చింతామణి గృహంలో వున్న దేవి మంచానికి కోళ్ళుగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వరుడు ఉండగా, సదాశివుడు మంచం మీద పలకగా అమరి ఉండగా, పంచప్రేతాసనాసీనగా త్రిపుర సుందరీ దేవి కొలువుదీరి ఉంటుంది. చతుర్దశ భువనాల్లో అందరు దేవతలూ నిత్యం ఈ దేవినే ఉపాసిస్తూ ఉంటారు. అందుకే త్రిపుర సుందరిని అత్యుత్తమ మహావిద్యగా పండితులు పరిగణిస్తారు.

క ఏ ఈ ల హ్రీం - హ స క హ ల హ్రీం - స క ల హ్రీం అనే 15 అక్షరాల (పంచదశాక్షరీ) మంత్రంతో ఈదేవిని ఉపాసిస్తారు. దీనికే శ్రీవిద్య అని పేరు.

ఈ పంచదశీ మంత్రంలోని 1. **క ఏ ఈ ల హ్రీం** అనే మొదటి విభాగాన్ని వాగ్భవకూటమని, 2. **హ స క హ ల హ్రీం** అనే రెండో విభాగాన్ని కామరాజ కూటమని, 3. **స క ల హ్రీం** అనే మూడో విభాగాన్ని శక్తి కూటమని అంటారు. ఈ త్రిపుర సుందరీదేవి బాలరూపాన్ని బాలా త్రిపుర సుందరిగా భావిస్తూ, **ఐం క్లీం సౌః** అనే మూడు బీజాక్షరాల మంత్రంతో ఉపాసిస్తారు. ఈ బీజాల్లోని **ఐం** జ్ఞాన శక్తిని, **క్లీం** కళా శక్తిని, **సౌః** పరిణామ శక్తిని సూచిస్తాయి.

పంచదశీ మంత్రంలోని **క ఏ ఈ ల హ్రీం - హ స క హ ల హ్రీం - స క ల హ్రీం -** అనే మంత్రానికి చివర **శ్రీం** బీజాన్ని చేర్చితే అది **షోడశీ** మంత్రమౌతుంది. పంచదశి శ్రీవిద్యకాగా, షోడశీ మహావిద్యగా లోకంలో ప్రసిద్ధి పొందింది.

అత్యంత మహిమోపేతమైన ఈ త్రిపుర సుందరీ మంత్రాన్ని దర్శించిన మొదటి ద్రష్ట శ్రీ దక్షిణామూర్తి ఋషి. ఆయన సాక్షాత్తు పరమేశ్వరుడే. దేవి మంత్రాన్ని దర్శించి, ఆ దివ్య రహస్యాన్ని సాధకుల సంక్షేమం కోరి లోకానికి స్వయంగా వ్యక్తం చేసాడు. అందుకే షోడశీ మహామంత్రానికి ప్రభావం చాలా ఎక్కువ. జగద్గురు ఆదిశంకరాచార్యులవారి ప్రోత్సాహంతో శృంగేరీపీఠ పరంపరలో శ్రీ త్రిపుర సుందరీదేవి ఆరాధనలు ఉపాసనలు ఎంతో ప్రాచుర్యాన్ని పొందాయి. ముఖ్యంగా జగద్గురువులు దేశమంతా సంచారం చేస్తూ ఎన్నో శక్తి దేవాలయాల్లో, శ్రీ చక్రయంత్ర ప్రతిష్ఠలు చేసి, ఆ ఆలయాలలో లలితా సహస్రనామ పూజలు జరిగేలా చేసిన కట్టడి, ఆయన తదనంతర కాలంలో విస్తృతమై శ్రీ లలితాదేవి ఉపాసనలు, ఆరాధనలు, సహస్రనామ పారాయణలు, దేశంలో విరివిగా జరిగేందుకు దోహదపడ్డాయి. అయితే అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటిగా ప్రయాగ క్షేత్రంలో శ్రీ లలితాదేవి పీఠం ఉన్నప్పటికీ, ఉత్తర భారతదేశంలో శ్రీ లలితాదేవి ఆరాధనలు, ఉపాసనలు, అంత విస్తృతంగా కనపడవు. దక్షిణ భారతానికి వస్తే శంకరాచార్యుల ప్రభావం వల్ల

ఇక్కడ అత్యధిక స్థాయిలో శ్రీ లలితా ఉపాసన జరుగుతూ కనిపిస్తుంది. ఎందుకంటే శంకరులు శ్రీ చక్ర యంత్ర ప్రతిష్ఠ చేసిన దేవాలయాలు నేటికీ ఎంతో జనాకర్షణని, ధనాకర్షణని చేస్తూ, ఎంతోమంది భక్తుల కోరికల్ని సఫలం చేస్తున్నాయి.

బ్రహ్మాండ పురాణంలో శ్రీ లలితోపాఖ్యానం పేరుతో శ్రీ త్రిపుర సుందరీ దేవి చరిత్ర ఎంతో వైభవంగా వ్యాసుల వారిచే చెప్పబడింది. ఈ ఉపాఖ్యానంలోని 42 అధ్యాయాల్లో భండాసురుడి జననం, శ్రీ కామేశ్వరుడి ఆవిర్భావం, శ్రీ లలితా కామేశ్వరుల వివాహం, సతీదేవి దేహత్యాగం, తారకాసురుడి పీడ, పరమేశ్వరుడి తపస్సు, మన్మథుడి దహనం, శ్రీ లలితా దేవి ఆవిర్భావం, శ్రీ చక్రరాజ రథ వర్ణనం, భండాసుర వధ, శ్రీ మాతంగ కన్యా జననం, శ్రీ నగర నిర్మాణం వంటి ఎన్నో విశేషాలు సవివంగా చెప్పబడ్డాయి.

ఈ షోడశీ మహావిద్యని పంచవక్త్రగా (ఐదుముఖాలు) మంత్రగ్రంథాల్లో వర్ణిస్తుంటారు. అంటే సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన, అనే ఐదు పేర్లు, శివుడి ఐదు రూపాలకి ప్రతీకలు. కాగా శివుడిలాగే షోడశీదేవి కూడా, నాలుగు దిక్కులా, నాలుగు ముఖాలు కలిగి, ఈ నాలుగు తలలపైన ఊర్ధ్వ దృష్టితో చూస్తూ మరో ముఖంతో కనిపిస్తుంది. ఈ దేవి తన శరీరంలోని పదిచేతుల్లో అభయ, టంక, శూల, వజ్ర, పాశ, ఖడ్గ, అంకుశ, ఘంట, నాగ, అగ్ని లను ధరించి, షోడశ కళలతో (16 కళలు) పరిపూర్ణంగా వికసించి ఉండటం వల్ల ఈమెని షోడశీ అని అంటారు. ఇతరమైన విద్యలు భోగం లేదా మోక్షం ఈ రెండిటిలో ఒకదాన్ని మాత్రమే ఇస్తాయి. అయితే శ్రీ త్రిపురసుందరీ సేవన **తత్పరాణాం – భోగ మోక్షశ్చ కరతలే ఏవచ** అన్న లోకోక్తి ప్రకారం శ్రీ త్రిపుర సుందరీ దేవి తన ఉపాసకుడికి భోగం, మోక్షం రెండింటినీ ప్రసాదిస్తుంది. భైరవయామణ తంత్రం అనే గ్రంథంలో షోడశీ విద్యకి సంబంధించిన సమాచారం ఎక్కువగా లభిస్తుంది.

శ్రీ త్రిపుర సుందరీ దేవి ఉపాసన సకలరోగాల్ని తగ్గించి, ఆరోగ్యాన్ని పెంపొందింపజేస్తుంది. ఈమె సర్వరోగహర చక్రస్వామిని. అందుకే శ్రీవిద్యకు – ఆయుర్వేదానికి, అయస్కాంత చికిత్సా పద్ధతికి, ఆక్యుపంచర్, ఆక్యుప్రెషర్, కలర్ థెరపీ వంటి చికిత్సలకు దగ్గరి సంబంధం ఉందని, ప్రముఖ పరిశోధకులు రచయిత డా॥ కొమరవోలు సుబ్బారావుగారు అభిప్రాయపడతారు.

అత్యంత మహిమోపేతమైన ఈ త్రిపుర సుందరీ మంత్రోపాసన వల్ల భోగమోక్షాలే కాదు. సర్వసిద్ధులూ కలుగుతాయని, **శ్రీవిద్యా జ్ఞాన మాత్రేణ సర్వసిద్ధిః ప్రజాయతే,** అని శాక్తప్రమోద తంత్రగ్రంథం చెబుతుంది. ఈ మహావిద్యని ఆనందభైరవుడు, హయగ్రీవుడు, దక్షిణామూర్తిల సంప్రదాయంలో సాధకులు ఉపాసిస్తుంటాడు. అలాగే మను, చంద్ర, లోపాముద్ర, కుబేర, మన్మథ, అగస్త్య, నందికేశ, సూర్య, విష్ణు, స్కంధ, శివ, దుర్వాసులు కూడా ఈ దేవీ ఉపాసకులు కాగా, వీరి పద్ధతుల్లో కూడా విభిన్న ఉపాసనా మార్గాలు ఏర్పడ్డాయి. అయితే ఏ మార్గాన్ని అనుసరించినా, భక్తి శ్రద్ధలతో సాధకులు త్రిపురసుందరీ ఉపాసన చేస్తే భక్తభీష్ట వరదాయినైన ఆ తల్లి తన లలిత హృదయంతో సాధకకుడి వాంఛల్ని సంపూర్ణంగా నెరవేరుస్తుంది. కనుక భోగమోక్షాలు రెండూ కావాలనుకునేవారు శ్రీ త్రిపుర సుందరీ (షోడశీ) దేవిని మూలమంత్ర జపహోమాల ద్వారా సంతృప్తి పరిస్తే ఆమె కరుణా కటాక్షాలు పొందవచ్చు.

**శ్రీ షోడశీ ఉపాసనా పద్ధతి :**

శ్రీ షోడశీ (త్రిపుర సుందరీ) మంత్ర సాధకులు వివిధ కామ్యాలకు అనుగుణంగా ఆ దేవిని వివిధ వర్ణాలతో భావించి ధ్యానించాలి.

మోక్షం కావాలనుకునే సాధనకులు వెన్నెలలాగా తెల్లని స్వరూపంతో వున్న లలితను ఉపాసించాలి. వశీకరణం కోరుకునే సాధకుడు కలువ పూవులా ఎర్రని వర్ణంతో విరజిల్లే దేవిని ఉపాసించాలి. కవిత్వ సిద్ధి కోసం స్ఫటికం లాంటి స్వచ్ఛమైన

రూపంగల త్రిపురని, ధనంకోసం బంగారు వర్ణం కలిగిన దేవిని, సకల సంపదలు అభివృద్ధి చెందాలనుకుంటే, శ్యామ (నల్లని) వర్ణం కలిగిన లలితని, శత్రువులకి వాక్స్తంభన చేయాలంటే నీలంరంగు శరీర వర్ణం కలిగిన మాతని, పూర్తి స్తంభన చేయాలనుకుంటే పసుపురంగుతో ప్రకాశించే లలితని ధ్యానించాలి. అలాగే మనశరీరంలో మూలాధారం నుంచి సహస్రారం వరకున్న షట్చక్రాల్లో మణిదీపంలా ప్రకాశిస్తూ, తేజో రూపిణిగా కొలువున్న లలితా త్రిపురను భక్తి శ్రద్ధలతో ఉపాసిస్తే సర్వసిద్ధులూ లభిస్తాయని బ్రహ్మాండ పురాణాంతర్గతమైన లలితో పాఖ్యానం సవివరంగా మనికి తెలియజేస్తుంది. ఇంకా ఈ ఉపాసన ఎంత గొప్పదంటే?

**వంశేతు యస్యకస్యాపి భవేదేషమనుర్యది ।**

**తద్వంశ్యాస్సర్వ ఏవ స్యుర్ముక్తా స్తృప్తా న సంశయః ॥**

(లలితోపాఖ్యానం- బ్రహ్మాండపురాణం)

ఎవరి వంశంలోనైనా ఒక్కడు లలితా త్రిపుర సుందరీ ఉపాసన చేస్తే ఆ వంశంలోని అన్ని తరాలవారు ముక్తి లభించి. సంపూర్ణమైన తృప్తితో తరిస్తారు. కనుక దశమహావిద్యలతో సౌమ్యదేవతగా, శాంతి ప్రదయినిగా, భోగ మోక్ష కారిణిగా సుప్రతిష్ఠితురాలైన శ్రీ త్రిపుర సుందరీ దేవిని ఉపాసించి, ఐహికాముష్మిక కఫలాలు పొందవలసిందిగా సాధకులందరినీ కోరుకుంటున్నాను. శ్రీ షోడశీ సాధన అనే ఈ గ్రంథంలో షోడశీ మంత్రాలతో పాటు అనుబంధంగా శ్రీ షోడశీ హృదయ, స్తోత్ర, కవచ, అష్టోత్తర శతనామ, సహస్రనామ స్తోత్రాలు కూడా అందిస్తున్నాము.

***ఈ గ్రంథంలో ఏమైనా పొరపాట్లు ఉన్నట్లయితే దయచేసి తెలియజేయగలరు. మలిముద్రణలో అవిసవరించుకుంటానని సవినయంగా మనవి చేస్తున్నాను.***

నమస్కారములతో... **బుధజన విధేయుడు**

**జయంతి చక్రవర్తి**

## సాధకులకు విన్నపం

దశమహావిద్యా ఉపాసకులు గమనించవలసిన ప్రధాన విషయం ఏ మంత్ర సాధన అయినా గ్రంధాలుచూసి చేస్తే ఫలించదు. మహామంత్రాలని సిద్ధిపొందిన గురువుల నుంచి ఉపదేశాన్ని పొంది, ఆ గురువు ఆదేశానుసారం వారి సూచనల ప్రకారం సాధన చేస్తేనే దేవతానుగ్రహం మంత్రసిద్ధి కలుగుతుంది. అలాకాక స్వతంత్రించి గ్రంధాల్లోని మంత్రాలను ఉపాసిస్తే అవి వికటించి మేలుజరగక పోగా కీడు జరిగే అవకాశమే ఎక్కువ. అయితే లోకంలో కొంతమంది పండితులు దేవత భక్తుణ్ణి ఆదరిస్తుంది కానీ ఎప్పుడూ శిక్షించదు. కనుక భయపడాల్సిన పనిలేదని ఉద్బోధిస్తున్నారు. వీరి మాట శాంతదేవతల విషయంలో కొంత వరకూ నిజమైనప్పటికీ ఉగ్రదేవతా సాధనల్లో అది దక్షిణాచారమైనా వామాచారమైనా సరియైన పద్ధతిలో గురువు ఉపదేశం లేకుండా మార్గదర్శనం లేకుండా మంత్రసాధన చేస్తే ఇబ్బందులు వచ్చే అవకాశం చాలా వరకూ ఉంది. కనుక సాధకులు ఈ విషయాన్ని తప్పకుండా గమనించాలి.

మంత్ర శాస్త్ర గ్రంధాల్లోని మూలమంత్రాన్ని అనుభవజ్ఞుడైన గురువు శిష్యుడి పేరుని అనుసరించి అతని పేరుకి అనుగుణంగా తగిన బీజాక్షరాల్ని సంపుటి చేసి మంత్రాన్ని ఉపదేశిస్తారు. తద్వారా సాధకుడు ఎటువంటి భయశంకలు లేకుండా మంత్రాన్ని ఉపాసించి దేవతానుగ్రహాన్ని పొందవచ్చు. స్తోత్రాలు, కవచాలు, హృదయం వంటివి ఉపదేశం లేకపోయినా ఏకులంవారైనా స్త్రీలైనా పురుషులైనా నిర్భయంగా పారాయణ చేసుకోవచ్చు.



# శ్రీ షోడశీ (త్రిపుర సుందరి) మంత్ర పురశ్చరణ విధానం

**మంత్రం అంటే ఏమిటి ?**

మకారం మననం ప్రాహుస్త్రకారస్త్రాణ ఉచ్యతే
మనన త్రాణ సంయుక్తో మంత్ర ఇత్యభిధీయతే

'మననం' చేసే సాధకుడిని అన్ని రకాల విపత్తుల నుండి రక్షించేది కాబట్టి మంత్రం అని పిలువబడుతుంది. **మం=** అనగా మననం చేసేవాడిని, **త్ర=** అనగా రక్షించునది, అని మంత్ర శబ్దానికి అర్థం.

**జపం అంటే ఏమిటి ?**

జకారో జన్మవిచ్ఛేదః పకారః పాపనాశకః ।
జన్మపాప వినాశిత్వా జ్జప ఇత్యభిధీయతే ॥

**జ** = అనగా జన్మవిచ్ఛేదన చేసేది అంటే పునర్జన్మ లేకుండా చేసేది
**ప** = అనగా పాపాల్ని నశింపచేసేది అని జపశబ్దానికి అర్థం.

మంత్ర మహార్ణవం, మంత్రమహెూదధి వంటి సుప్రసిద్ధ గ్రంథాలలో వివిధ దేవతా మంత్రాలని ఏ విధంగా జపంచేయాలి. ఏ మాల ఉపయోగించాలి. ఏ ఆసనం మీద కూర్చోవాలి. ఏ సమయంలో చేయాలి. ఏ రంగు వస్త్రాల్ని ధరించాలి. పురశ్చరణ ఏ విధంగా చేయాలి. అనే విషయాలు విపులంగా వివరించబడ్డాయి. ఆ గ్రంథాలలో పేర్కొన్న విధంగా మనం కూడా శ్రీ షోడశీ మంత్రాన్ని పురశ్చరణా పూర్వకంగా జపించాలి. అప్పుడే మంత్రసిద్ధి జరుగుతుంది. ఆ మూలమంత్రంతో స్వయంగా చేసే జపం సత్ఫలితాన్నిస్తుంది.

**పురశ్చరణ అంటే :**

ఏ మంత్రాన్నైనా శాస్త్రోక్తంగా ఒక నియమిత పద్ధతిలో సాధన చేసే విధానాన్ని పురశ్చరణ అంటారు.

పంచాంగోపాసనే నేష్టదేవతా ప్రీతిదానః ॥
పురశ్చరతి భక్తస్య తత్పురశ్చరణం ప్రియే ॥

జపము, హోమము, తర్పణము, మార్జనం, బ్రాహ్మణ భోజనం ఇవి పురశ్చరణలోని పంచాంగాలు. ఈ ఐదు విధాలైన కర్మచేత మనం ఉపాసించే దేవత (శ్రీ షోడశీదేవి) సంతోషించి **పురః** = బిడ్డలమైన మన ముందు, **చరతి** = సంచరిస్తుంది. కాబట్టి దీనికి పురశ్చరణ అనే పేరు వచ్చింది.

**పురశ్చరణ ఎందుకు ?**

**జీవహీనోయథాదేహీ సర్వకర్మసు న క్షమః ।**
**పురశ్చరణ హీనో హి తథామంత్రః ప్రకీర్తితః ॥**

జీవంలేని దేహం ఎలాగైతే కార్యసాధనకి పనికిరాదో అలాగే పురశ్చరణ లేని మంత్రం కూడా నిరర్థకమైనదని భావం. కాబట్టి శ్రీషోడశీదేవి మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసిస్తేనే ఆ దేవత అనుగ్రహం మనకు లభిస్తుంది.

**పురశ్చరణ సంఖ్య:**

వివిధ మంత్రశాస్త్ర గ్రంథాలలో వివరించిన ప్రకారంగా ఏ మంత్రానికైనా 1) ఒక లక్ష సార్లు అనగా (**108** సంఖ్య గల మాలతో **1000** మాలలు) మూల మంత్రాన్ని జపం చేయాలి. 2) అందులో పదో వంతు అనగా **10 వేల** సార్లు ఆ మూలమంత్రంతో హోమం చేయాలి. 3) హోమ సంఖ్యలో పదోవంతు అనగా ఒక **వెయ్యి** సార్లు ఆ మూలమంత్రంతో తర్పణ చెయ్యాలి. 4) తర్పణ సంఖ్యలో పదోవంతు. **100** సార్లు మూలమంత్రంతో మార్జన లేదా అభిషేకం చెయ్యాలి. 5) అందులో పదో వంతు. **10** మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి. ఈ ఐదు పనులతో మంత్ర పురశ్చరణ పూర్తవుతుంది. (ఇక్కడ శాస్త్రంలో బ్రాహ్మణ భోజనం అని వున్నప్పటికీ ఏ పదిమందికైనా భోజనం పెట్టవచ్చు)

**మంత్రోపదేశం:**

మంత్రశాస్త్ర నియమం ప్రకారం ఏ మంత్రాన్నైనా సిద్ధిపొందిన ఒక గురువు నుండి ఉపదేశం పొంది, పురశ్చరణ పూర్వకంగా ఉపాసించాలి. అలా కాకుండా గ్రంథాలను చూసి సాధన చేస్తే ఇబ్బందులకు గురయ్యే అవకాశం ఉంటుంది. సాధకులు ఈ విషయాన్ని ముఖ్యంగా దృష్టిలో ఉంచుకోవాలి.

**జపం చేయటానికి మంచి రోజు :**

శ్రీ షోడశీ మంత్రాన్ని పురశ్చరణా పూర్వకంగా అనుష్ఠానం చేయాలనుకునే సాధకులు శుద్ధ అష్టమి నుంచి పూర్ణిమ వరకు జపం చేస్తే సత్వర ఫలితం లభిస్తుంది. సాధారణంగా సాత్విక దేవతలందరికీ ఈ తిథులు అత్యంత ప్రీతికరమైనవి.

**జపస్థానం :**

శ్రీషోడశీ మంత్రాన్ని జపించాలనుకొనే సాధకులు. మంత్రశాస్త్రంలో చెప్పిన విధంగా

**పుణ్యక్షేత్రం నదీతీరం గుహా పర్వత మస్తకం**
**తీర్థ ప్రదేశా స్సింధూనాం సంగమః పావనం వనం**
**ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటం గిరేః**
**దేవతాయతనంకూలం సముద్రస్య నిజం గృహం**
**సాధకేషు ప్రశస్త్యన్తే స్థానాన్యేతాని మంత్రిణం** *(శారదాతిలకం)*

పుణ్యక్షేత్రం, నదీతీరం, గుహ, పర్వతాగ్రం, తీర్థ ప్రదేశాలు, సాగర సంగమ స్థలాలు, పవిత్ర వనాలు, జనసంచారంలేని ఉద్యానవనాలు బిల్వవృక్ష మూల ప్రదేశాలు, కొండలు, దేవాలయాలు, సముద్ర తీరాలు, స్వగృహాలు. ఇవన్నీ పురశ్చరణకు స్థానాలుగా చెప్పబడ్డాయి. కనుక ఈ ప్రదేశాలలో ఎక్కడైనా జపం చేయవచ్చు. అయితే దశమహావిద్యలు కొలువున్న అత్యంత శక్తివంతమైన స్థలం కామాఖ్యా పీఠం. అస్సాంలోని గౌహతీ దగ్గర నీలాచలం పై నెలకొన్న ఆ కామాఖ్య పీఠంలో సాధన చేస్తే త్వరగా సాధకులకు శ్రీ షోడశీ అనుగ్రహం లభిస్తుంది.

**జపానికి ఆసనం :**

**ఆత్మసిద్ధి ప్రదానశ్చ సర్వరోగ నివారణాత్ ।**
**నవసిద్ధి ప్రదానాశ్చ ఆసనం పరికీర్తనమ్ ॥**

మంత్ర జపానికి ఆసనం చాలా ముఖ్యమైనది. అసలు ఆసనం అంటే

**ఆ** = అనగా ఆత్మ సాక్షాత్కారాన్ని కలిగించేది.
స = అనగా సర్వ రోగాలని హరించేది.
**నం** = నవ సిద్ధులను ఇచ్చేది 'ఆసనం' అని చెప్పబడుతుంది.

శ్రీ షోడశీ మంత్రం జపం చేయటానికి ఆసనం ఎంతో అవసరం. ప్రతిరోజూ ఒక శుభస్థానంలో కూర్చుని జపంచేయాలి కాబట్టి, వేసుకునే ఆసనం కూడా దేవతకు ఇష్టమైన రంగులో ఉండేలా చూసుకోవాలి. శ్రీ షోడశీదేవికి ప్రీతికరమైన రంగు ఎరుపు కనుక ఈ రంగులో ఉండే ఆసనాన్ని ఉపయోగించాలి.

**"కుశాసనే మంత్రసిద్ధిర్నాత్ర కార్యా విచారణా"** అని శాస్త్రంలో చెప్పబడింది కాబట్టి దర్భాసనం మంత్రసిద్ధికి తోడ్పడుతుంది. కనుక దర్భాసనం మీద ఎర్రని రంగు గల చిత్రాసనాన్ని వేసుకుని జపం చేయవచ్చు.

**గమనిక: క్రింద కూర్చోలేనివారు, శరీరం సహకరించనివారు, వృద్ధులు, కుర్చీలో ఆసనం వేసుకుని జపం చేసుకోవచ్చు. హెూమం చేసుకోవచ్చు.**

**జపమాల :**

మంత్ర జపానికి ఆసనం తరువాత ముఖ్యమైనది జపమాల ఒక్కొక్క దేవతకి ఒక్కోరకమైన మాలని ఉపయోగిస్తారు. **"రక్తచందన మాలాతు భోగదా మోక్షదా భవేత్"** అని శాస్త్రంలో చెప్పబడింది.

శ్రీ షోడశీ సాత్విక స్వరూపిణి కాబట్టి ఎర్రని పూసలమాల రక్తచందన మాల, స్ఫటిక లేదా రుద్రాక్షమాల వీటిలో దేనినైనా ఉపయోగించవచ్చు.

*(మాల 108 పూసలతో వుండాలి)*

**గమనిక : జపమాలని మెడలో ధరించకూడదు.**

**వస్త్రం: పీత కౌశేయ వసనం విష్ణు ప్రీత్యై ప్రకీర్తితమ్ ।**
**రక్తం శక్త్యార్క విఘ్నానాం శివస్య చ సితం ప్రియం ॥**

సాధారణంగా పీతవర్ణంలో వుండే వస్త్రం విష్ణువుకి, ఎరుపు వర్ణంలో వుండే వస్త్రం శక్తి, సూర్యుడు, గణపతికి, సిత వర్ణంలో వుండే వస్త్రం శివుడికి ప్రీతికరములుగా చెప్పబడతాయి.

శ్రీ షోడశీ మంత్ర పురశ్చరణ చేసే సాధకులు ఎరుపు రంగు పంచె ఉత్తరీయాన్ని ధరించాలి.

**గమనిక : జపం చేసేదప్పుడు ధరించిన వస్త్రాలతో భోజనం చేయకూడదు.**

**జపం చేసే దిక్కు:**

శ్రీషోడశీ దేవి మంత్రాన్ని పురశ్చరణ చేసే సాధకులు తూర్పు లేక ఉత్తరం దిక్కులకు అభిముఖంగా కూర్చుని జపం చేస్తే శుభప్రదంగా వుంటుంది.

**జపం చేయవలసిన రోజులు:**

సాధారణంగా జపాన్ని సాధకులు తమకు అనువైనన్ని రోజులలో **10** లేక **20** లేక **40** రోజులలో జపాన్ని పూర్తి చేయవచ్చు. అయితే తాము స్వీకరించిన రోజుల్లో మొత్తం జపసంఖ్యని ఆ రోజులకి అనుగుణంగా విభాగించుకుని ప్రతిరోజూ అదే సంఖ్య తగ్గకుండా జపంచేయాలి. ఉదా: **10** రోజులు స్వీకరిస్తే **1** లక్ష జపాన్ని (అనగా వేయి మాలలు) రోజుకి (**100×10** చొప్పున మొత్తం పదిరోజులకి **1000** మాలలు జపం చేయాలి. ఇదేవిధంగా మీరు స్వీకరించిన రోజులను బట్టి జపమాలల సంఖ్యను సమంగా స్వీకరించి జపం చేయాలి.

**జపం పద్ధతులు:**

1. వాచికం (పైకి వినబడేలా చేసేది) 2. ఉపాంశువు = పెదవులతో పైకి వినబడకుండా నోటితో చేసేది 3. మానసికం = పెదవులు కదలకుండా నోటితో కాకుండా కేవలం మనసులోనే జపించేది. పై మూడింటిలో మానసికమే ఉత్తమమైనది కాబట్టి శ్రీషోడశీదేవి రూపాన్ని మనసులో ధ్యానిస్తూ మంత్రాన్ని స్పష్టంగా కళ్ళు మూసుకునిగానీ, నాసికాగ్రం పై దృష్టి నిలిపిగానీ, మానసికంగా జపం చేయాలి.

**జపం చేసే విధానం:**

జపాన్ని చేసే సాధకులు జపమాలని ఉంగరం వేలుమీద ఉంచి బొటనవేలు, మధ్యవేలు ఈ రెండింటితో మాలలోని పూసని, మంత్రాన్ని జపిస్తూ తనవైపుకి లోనికి లాక్కోవాలి. కొలికి పూస వేలికి తగిలేవరకూ లెక్కించి దీనిని దాటకుండా మాలని వెనక్కితిప్పి మరల జప గణన చేయాలి. చూపుడువేలు మాలకు తగలకుండా, జపమాల నేలకు తగలకుండా, క్రిందకు జారిపడకుండా, సాధకుడు జాగ్రత్తపడాలి.

*(గోముఖం అనగా జపం చేయటానికి ఉపయోగించే సంచిని వినియోగించండి)*

**మంత్రాన్ని ఎలా జపించాలి :**

ఉచితాసనం మీద కూర్చుని మాలను స్వీకరించి జపాన్ని చేసే సాధకుడు. **"అక్షరాక్షర సంయుక్తం జపేన్మౌక్తిక పంక్తివత్"** ముత్యాల వరసలాగా అక్షర అక్షరం స్పష్టంగా వుండేలా అక్షరాక్షర సంయుక్తంగా జపించాలి.

**గమనిక : 1) అలాగే మాలని ఎవరికంటా పడకుండా గోముఖం సంచిలో వుంచిగానీ, ఉత్తరీయం అడ్డుగా వుంచిగానీ జపం చేయాలి. 2) జపమాలను క్రింద పడవేయకూడదు. 3) ప్రతిరోజూ నియమిత జపం పూర్తయిన తరువాత జపమాలను పవిత్రమైన ప్రదేశంలో వుంచాలి.**

**జప నియమాలు :**

సత్యేనాపి న భాషేత జపహోమార్చనాదిషు ।
అన్యథానుష్ఠితం సర్వం భవత్యేవ నిరర్థకం ॥

జపం చేసేటప్పుడు హోమం చేసేటప్పుడు పూజలు చేసేటప్పుడు సత్యమైన అత్యవసరమైన విషయాల గురించైనా సరే మధ్యలో ఇతరులతో ఏమీ మాట్లాడకూడదు. అలా మాట్లాడితే ఆ జపం, హోమం, పూజ నిరర్థకమవుతాయి. కాబట్టి జాగ్రత్త వహించి ఎవరితో మాట్లాడకుండా శ్రీ షోడశీమంత్రాన్ని ఏకాతంగా అనుష్టానం చేయాలి.

**జపంలో ధ్యానం :**

శ్రీ షోడశీమంత్రాన్ని తదేకదీక్షతో జపం చేస్తున్నప్పుడు కొంత మంది సాధకులకు ఏకాగ్రస్థితి వచ్చి మంత్ర జపం ఆగిపోవచ్చు. ఆ సమయంలో శ్రీషోడశీదేవి దివ్య మంగళాకారాన్ని దర్శిస్తూ తాదాత్మ్యంలో వుండిపోవచ్చు. ఆ స్థితి చాలా గొప్పది. ఆ స్థితిలో వున్నంతసేపు వుండి, తిరిగి సాధారణ స్థితికి వచ్చాక మరల జపాన్ని ప్రారంభించవచ్చు.

**జపాన్ని ఏ సమయంలో చేయాలి :**

**నక్తంచరాః దేవతాః** దేవతలు రాత్రులలో సంచరిస్తారు అని శాస్త్ర వచనం. కాబట్టి శక్తి సాధనలని సాధారణంగా రాత్రి 9 గంటల నుండి 2 గంటల వరకు ఆచరిస్తారు. శ్రీ షోడశీ మంత్రాన్ని ఉదయం పూట కూడా జపం చేయవచ్చు.

## శ్రీ షోడశీ మంత్ర జప ప్రారంభం

**జప సంకల్పం :**

**ముందుగా ఉద్ధరిణ, పంచపాత్ర తీసకుని**

1. ఓం కేశవాయస్వాహా 2. ఓం నారాయణాయస్వాహా 3. ఓం మాధవాయస్వాహా అని మూడు సార్లు ఆచమనం చేసి, ఆ తరువాత ప్రాణాయామం చేసి

**మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే --- దేశే భగవత్సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన --- సంవత్సరే --- ఆయనే --- ఋతౌ --- మాసే --- పక్షే --- తిథౌ --- వాసరే --- నక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం --- గోత్రోద్భవస్య ---అహం శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం పురశ్చరణ పూర్వక. శ్రీ షోడశీ మంత్ర జపం కరిష్యే...**అని సంకల్పం చెప్పుకుని ఉంగరం వేలితో పంచపాత్రలో నీటిని తాకవలెను. తరువాత మనసారా తారామాతకి నమస్కారం చేసుకుని జపానికి ఏ విఘ్నాలు కలుగకుండా ముందుగా...

**శ్రీ గణపతి ప్రార్థన :**

**వక్రతుండ మహాకాయ కోటి సూర్య సమప్రభా ।**
**నిర్విఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥**

అని గణపతికి ముందుగా నమస్కారం చేయండి.

**గమనిక : పురశ్చరణకోసం చేసే సంకల్పంలో తమ కోరికలు చెప్పుకోకూడదు కేవలం దేవతా ప్రీతికొరకే సంకల్పించాలి.**

**గురు వందనం :**

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః ॥**

అని మీకు మంత్రదీక్ష ఇచ్చిన గురువుకి ముందుగా నమస్కరించండి.

**శ్రీ షోడశీ మంత్రజపానికి ముందుగా దశమహావిద్యల పరిపూర్ణ అనుగ్రహం కోసం ఈ గ్రంథంలో 12 నుండి 17వ పేజిలలో ఇవ్వబడిన దశమహావిద్యల కవచ, స్తోత్రాలని పఠించండి.**

## శ్రీ షోడశీ (త్రిపుర సుందరి) మూల మంత్రం

| |
|---|
| శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం<br>హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం |

అస్య శ్రీత్రిపురసుందరీ మంత్రస్య దక్షిణామూర్తి ఋషిః, పంక్తిచ్ఛందః, శ్రీ త్రిపురసుందరీదేవతా ఐం బీజం, సౌః శక్తిః, క్లీం కీలకం, శ్రీ షోడశీ (త్రిపుర సుందరీ) ప్రీత్యర్థేజపే వినియోగః

**ఋషిన్యాసం:**

1. ఓం దక్షిణామూర్తయే నమః శిరసి
2. పంక్తి ఛందసే నమః ముఖే
3. శ్రీత్రిపుర సుందరీదేవతాయైనమః హృది
4. ఐం బీజయ నమః గుహ్యే
5. సౌః శక్తియే నమః పాదయోః
6. క్లీం కీలకాయనమః నాభౌ
7. వినియోగాయ నమః సర్వాంగే - (ఈ విధంగా ఋష్యాదిన్యాసం చేయాలి.)

| కరన్యాసం | హృదయన్యాసం |
|---|---|
| హ్రీం శ్రీం అం అంగుష్ఠాంభ్యాం నమః | శ్రీం హ్రీం క్లీం ఐం సౌః హృదయాయ నమః |
| హ్రీం శ్రీం ఆం తర్జనీభ్యాం నమః | ఓం హ్రీం శ్రీం శిరసే స్వాహా |
| హ్రీం శ్రీం అం మధ్యమాభ్యాం నమః | క ఏ ఈ ల హ్రీం శిఖాయై వషట్ |
| హ్రీం శ్రీం ఆం అనామికాభ్యాం నమః | హ స క హ ల హ్రీం కవచాయ హుం |
| హ్రీం శ్రీం సౌః కనిష్ఠికాభ్యాం నమః | స క ల హ్రీం నేత్రత్రయాయౌషట్ |
| హ్రీం శ్రీం సౌః కరతలకర పృష్ఠాభ్యాం నమః | సౌః ఐం క్లీం హ్రీం శ్రీం అస్త్రాయఫట్ |

**భూర్భు వస్సువరోమితి దిగ్బంధః**

**ధ్యానమ్ :**

**బాలార్కాయుత తేజసం త్రినయనాం రక్తాంబరోల్లాసినీం**

**నానాలంకృతి రాజమాన వసుధాం బాలోడురాట్ శేఖరాం**

**హస్తైరిక్షు ధనుస్సృణీం సుమశరం పాశం బిభ్రతీం**

**శ్రీచక్రస్థిత సుందరీం త్రిజగతామాధారభూతాం స్మరేత్ ॥**

**భావం :**

ఎర్రనివస్త్రాలను ధరించి శరీరం మీద వివిధ వివ్యాభరణాలు అలంకరించుకుని, చంద్రకళతో ప్రకాశిస్తూ, తన నాలుగు చేతులలో చెరుకువిల్లు, అంకుశం, పుష్పబాణం, పాశం, ధరించి శ్రీచక్రంలో కొలువుండి, మూడులోకాలకు ఆధారభూతమై బాలసూర్యుడి లాంటి కాంతితో వెలుగొందే షోడశీ (త్రిపురసుందరీ) దేవిని స్మరిస్తున్నాను.

## లమిత్యాది పంచపూజలు

పంచపాత్రలో నీటిని ఉద్ధరిణతో తీసుకుని శ్రీ షోడశీ పరదేవతాయై **పాద్యం** సమర్పయామి **అర్ఘ్యం** సమర్పయామి **ఆచమనం** సమర్పయామి అంటూ అరివేణం (పళ్ళెం)లో పోయాలి.

**లం** పృథివీ తత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై గంధం ధారయామి

**హం** ఆకాశతత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై పుష్పైః పూజయామి

**యం** వాయుతత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై ధూపం అఘ్రాపయామి

**రం** తేజస్తత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై దీపం దర్శయామి

**వం** అమృతతత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై అమృత నైవేద్యం సమర్పయామి

అని చెపుతూ ఉద్ధరణితో నీటిని ఐదు సార్లు అరివేణం (పళ్ళెం)లో వేయాలి.

**జపమాల మంత్రం :**

శ్రీ షోడశీ మంత్ర జపాన్ని ప్రారంభించటానికి ముందు సాధకుడు జపమాలను చేతితో తీసుకుని కళ్ళకు అద్దుకుని మనసులో

**ఓం మాం మాలే మహామాయే సర్వమంత్ర స్వరూపిణి ।**
**చతుర్వర్గ స్త్వయిన్యస్త స్తస్మాన్మే సిద్ధిదా భవ ॥**

అని మనసులో తలచుకుని భక్తి పూర్వకంగా నమస్కరించి జపం చేయటం ప్రారంభించాలి.

**గురు మంత్రం :**

మీకు దీక్షనిచ్చిన గురువు ద్వారా గురుమంత్రోపదేశాన్ని పొంది ఆ మంత్రాన్ని శ్రీషోడశీ మంత్రానికి ముందుగా ఒక మాలని, అలాగే జపం పూర్తయిన తరువాత ఒక మాలని జపం చేయాలి. తద్వారా గురువు అనుగ్రహం లభించి దేవతామంత్రసిద్ధి మీకు త్వరగా కలుగుతుంది.

**శ్రీ షోడశీ మంత్రం :**

| |
|---|
| శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం<br>హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం |

అని శ్రద్ధాభక్తులతో మౌనంగా మనస్సులో మూలమంత్ర జపం చేయండి.

**జపాంత విధి :**

**సువర్ భువర్ భూరితి దిగ్విమోకః** అని దిగ్విమోచనం చేసి, మరల ముందు తెలిపిన ధ్యాన శ్లోకం చదివి ఈ క్రింది విధంగా చెపుతూ జపసమర్పణ చేయాలి.

**జప సమర్పణ :**

పై తెలిపిన విధంగా ప్రతిరోజూ నియమిత సంఖ్యలో జపం చేయటం పూర్తయిన తరువాత, తిరిగి మూడు సార్లు ఆచమనం చేసి కొన్ని నీళ్ళు చేతిలో తీసుకుని **అనేన మయాకృతేన శ్రీ షోడశీ పరదేవతా మంత్ర జపేన శ్రీ షోడశీ పరదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. శ్రీ షోడశీ పరదేవతా సంపూర్ణ అనుగ్రహ కటాక్ష సిద్ధ్యర్థం ఏతత్ జపఫలం శ్రీ షోడశీ పరదేవతా చరణారవిందార్పణమస్తు... తత్సత్ బ్రహ్మార్పణమస్తు**

అని ఆ నీటిని అరివేణం (ఒక పళ్ళెం)లో విడవాలి. అలా విడిచిన నీటిని మూడు సార్లు తీర్థంగా తీసుకోవాలి.

**మీరు జపం చేసే అన్ని రోజులూ ఇదే విధంగా చేయాలి.**

**జప ప్రాశస్త్యం:**

పైన తెలిపిన నియమాలను ఆచరిస్తూ అచంచల భక్తి విశ్వాసాలతో జపాన్ని చేస్తే ఎన్నో శుభఫలితాలు కలుగుతాయి.

**జపేన దేవతా నిత్యం స్తూయమానా ప్రసీదతి**
**ప్రసన్నా విపులాన్భోగాన్ దద్యాన్ముక్తించ శాశ్వతీం**
**యక్ష రక్షః పిశాచాశ్చ గ్రహాస్సర్పాశ్చ భీషణాః**
**జాపినం నోపసర్పంతి భయభీతా స్సమంతతః**
**యావంతః కర్మయజ్ఞానుస్స్యుః ప్రతిష్ఠాశ్చ తపాంసి చ**
**సర్వే తే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీం**
**మాహాత్మ్యం వాచకస్మైత జ్ఞపయజ్ఞస్య కీర్తనం ॥**

జపం చేయటం ద్వారా స్తుతించబడ్డ దేవతలు నిత్యం సాధకుడికి ప్రసన్నమై వుంటారు. వారికి శాశ్వత భోగ మోక్షాల్ని ప్రసాదిస్తారు. యక్ష, రక్షః పిశాచాలు, దుష్టగ్రహాలు, జపంచేసే వాడిని చూసి భయపడతాయి.

తపస్సులు, కర్మయజ్ఞాలు, జపయజ్ఞంలో పదహారో భాగానికి కూడా సరిరావు. ఈ చెప్పిన జప మహాత్మ్యం వాచికంగా చేసే జపానికే, దీనికి శతాధికంగా ఉపాంశు జపానికి, సహస్రాధికంగా మానసిక జపానికి మాహాత్మ్యం అధికమని శాస్త్రం చెబుతుంది.

## శ్రీ షోడశీ మంత్ర పురశ్చరణ సంఖ్య

**పురశ్చరణ:**

పై తెలిపిన షోడశీ మహావిద్యా మంత్రాన్ని 1 లక్షసార్లు జపించాలి. (మంత్ర మహోదధి ప్రకారం) ఈ 1 లక్ష జపాన్ని సాధకుని శక్త్యానుసారం 11-21-40

రోజులలో పూర్తి చేయవచ్చు. ఈ షోడశీ మంత్రాన్ని జపం చేసిన తరువాత ఈ మంత్ర దశాంశ హోమాన్ని 10 వేల సార్లు త్రిమధురాలతో (తేనె, పంచదార, పాలు) ఎర్రని పూలతో చేయాలి. అప్పుడు మంత్రం సిద్ధిస్తుంది.

సాధారణంగా ఏ మంత్రాన్నైనా 1 లక్ష జపం పురశ్చరణకు చేస్తే సరిపోతుంది. కాబట్టి ఇక్కడ తెలియజేసే పురశ్చరణ అంగాల వివరాలన్నీ 1 లక్ష జపాన్ని అనుసరించి చెప్పబడుతున్నాయి. ఈ విషయాన్ని సాధకులు గమనించగలరు.

**జప నియమాలు :**

ఈ షోడశీదేవతా జపాన్ని పరిశుద్ధమైన ప్రదేశంలో, అమ్మవారి దేవాలయాల్లో, నదీ సముద్ర తీరాల్లో చేయాలి. సాధారణ నియమాలు పాటించాలి. ప్రతిరోజు ఒకే ప్రదేశంలో కూర్చొని జపం చేయాలి. షోడశీ ఉపాసన చేసేవారు. స్త్రీలని గౌరవించాలి. శాంతంగా పరుషవాక్యాలు పలుకకుండా ఉండాలి.

## పురశ్చరణ అంగాలు

**శ్రీ షోడశీ మంత్ర దశాంశ హోమం :**

శ్రీ షోడశీ మంత్ర పురశ్చరణలో భాగంగా నియమ పూర్వకంగా ఒక లక్షసార్లు **(1000 మాలలు)** జపం చేసిన తరువాత అందులో దశాంశం అనగా పదివేల సార్లు మూలమంత్రంతో హోమాన్ని చేయాలి.

**హోమ సంకల్పం :**

మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీషోడశీ పరదేవతాముద్దిస్య శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం. శ్రీ షోడశీ మంత్ర పురశ్చరణాంగత్వేన **శ్రీషోడశీమంత్ర హవనం కరిష్యే** అని సంకల్పం చెప్పుకొని హోమాన్ని ప్రారంభించాలి.

**(హోమ విధానం ప్రత్యేకంగా తెలియచేయబడింది.)**

## శ్రీషోడశీ హోమ మంత్రం

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం
హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం స్వాహా

**సమర్పణ:**

ఈ విధంగా మూలమంత్రంతో 10వేల సార్లు హోమం చేసిన తరువాత చివరగా "అనేన మయాకృతేన శ్రీషోడశీమంత్ర హవనేన శ్రీషోడశీ పరదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదాభవతు. శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీషోడశీ పరదేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు హోమకుండంలోకి వదలాలి. తరువాత హోమ భస్మాన్ని నుదుట ధరించాలి.

## శ్రీ షోడశీ మంత్ర తర్పణం

**తర్పణ సంకల్పం:**

జప దశాంశం హోమాన్ని చేసిన తరువాత అదే మంత్రంతో హోమ దశాంశం అనగా ఒక **వేయిసార్లు** తర్పణ చేయాలి.

"మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీషోడశీ పరదేవతాముద్దిస్య శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం. శ్రీ షోడశీ మంత్ర పురశ్చరణాంగత్వేన శ్రీ షోడశీ మంత్ర తర్పణం కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని తర్పణాన్ని ప్రారంభించాలి.

ఒక పళ్ళెంలో శ్రీషోడశీ యంత్రాన్ని ఉంచి, గంధపుష్పాలతో అర్చించి గంధం, అక్షతలు, పాలు, శుద్ధజలంలో కలిపి తర్పణం చేయాలి.

## తర్పణ మంత్రం

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం
హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం
శ్రీషోడశీ పరదేవతాం తర్పయామినమః

**తర్పణ సమర్పణ :**

"అనేన మయాకృతేన శ్రీ షోడశీ మంత్ర తర్పణేన శ్రీ షోడశీ పరదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. శ్రీ షోడశీ పరదేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీ షోడశీ పరదేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు ఒక పళ్ళెంలోకి వదలాలి. దీనితో తర్పణం పూర్తవుతుంది.

## శ్రీ షోడశీ మంత్ర మార్జనం లేదా అభిషేకం

**అభిషేక సంకల్పం :**

ఇలా మంత్రంతో తర్పణ చేసిన తరువాత అందులో పదోవంతు అనగా **100** సార్లు మార్జనం లేదా అభిషేకం చేయాలి.

"మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీషోడశీ పరదేవతాముద్దిస్య శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం. శ్రీషోడశీ మంత్ర పురశ్చరణాంగత్వేన శ్రీషోడశీ మంత్ర అభిషేకం కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని, ఒక పంచపాత్రలో పాలు లేదా కుంకుమ కలిపిన నీరు తీసుకుని వాటితో ఒక పెద్దపళ్ళెంలో షోడశీ విగ్రహాన్ని గానీ, యంత్రాన్ని గానీ ఉంచి వాటిపై పువ్వుతో గాని, ఉద్ధరిణతో గాని అభిషేకం చేయాలి.

## అభిషేక మంత్రం

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం శ్రీ షోడశీ పరదేవతాం అభిషించామి నమః**

**అభిషేక సమర్పణ :**

"అనేన మయాకృతేన శ్రీషోడశీ మంత్ర అభిషేకేన శ్రీషోడశీ పరదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదా భవతు. శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీషోడశీ పరదేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు అరివేణం (ఒక పళ్ళెం)లోకి వదలాలి. దీనితో అభిషేకం పూర్తవుతుంది.

# బ్రాహ్మణ భోజనం

**బ్రాహ్మణ భోజన సంకల్పం:**

పురశ్చరణలో భాగంగా **100** సార్లు అభిషేకం చేసిన తరువాత అందులో పదోవంతు అనగా **10** మంది బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి.

"మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ షోడశీ పరదేవతాముద్దిస్య శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం. శ్రీషోడశీ మూలమంత్ర పురశ్చరణాంగత్వేన **బ్రాహ్మణ భోజనం (అన్నసంతర్పణం)** కరిష్యే" అని సంకల్పం చెప్పుకొని 10 మందికి తృప్తిగా ఆదరంగా భోజనం పెట్టుకోవాలి. ఇది శాస్త్ర నియమమైనప్పటికీ, ఏ వర్ణంవారినైనా పదిమందిని పిలిచి భోజనం పెట్టుకోవచ్చు.

**సమర్పణ :**

ఈ విధంగా అన్న వితరణ చేసిన తరువాత "అనేన మయాకృతేన శ్రీషోడశీ మంత్ర పురశ్చరణాంగత్వేన అన్నసంతర్పణేన శ్రీషోడశీ పరదేవతా సుప్రీతా సుప్రసన్నా వరదాభవతు. శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం ఏతత్ఫలం సర్వం శ్రీషోడశీ పరదేవతా చరణారవిందార్పణమస్తు, తత్సద్బ్రహ్మార్పణమస్తు" అని ఉద్ధరిణతో నీళ్ళు అరివేణం (ఒక పళ్ళెం)లోకి వదలాలి. అలా వదిలిన నీటిని **3** సార్లు తీర్థంగా స్వీకరించాలి.

***దీనితో శ్రీ షోడశీ మంత్ర పురశ్చరణ పూర్తవుతుంది.***

**పురశ్చరణ చేయలేనివారికి:**

శ్రీషోడశీ దేవి పై అచంచలమైన భక్తి విశ్వాసాలు కలిగి వుండి పురశ్చరణ విధానాన్ని అనుసరించలేని వారికి కూడా ఒక మార్గం శాస్త్రంలో చెప్పబడింది.

**యది పూజాద్యశక్తశ్చే ద్రవ్యాభావేన సుందరి ।**
**కేవలం జపమాత్రేణ పురశ్చర్యా విధీయతే ॥**

తగినంత శక్తి లేక పంచాంగ పూర్వకంగా పురశ్చరణ చేయలేని వారు అచంచలమైన భక్తితో శ్రీషోడశీదేవిని మనసులో "అమ్మా నేను పురశ్చర్యను శాస్త్రోక్త పద్ధతిలో ఆచరించటానికి అశక్తుడను, దయచేసి నాకు మంత్ర జపంతోనే మంత్రసిద్ధిని

ప్రసాదించు" అని వేడుకుని జపాన్ని చేస్తే కేవలం జపంతోనే పూర్తి పురశ్చరణ ఫలం లభిస్తుంది. గుర్తుంచుకోండి ఇది కేవలం శక్తిలేని వారికి మాత్రమే. అవకాశం వుండీ, శక్తివున్న సాధకులు పంచాంగ పూర్వకంగానే పురశ్చరణ చేయాలి.

**పురశ్చరణ-స్త్రీలు :**

పురుషులు శ్రీషోడశీ మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా, పంచాంగ సహితంగా అనుష్ఠానం చేస్తేనే సంపూర్ణ ఫలితం లభిస్తుంది. అదే స్త్రీల విషయంలో పురశ్చరణ విషయమై మంత్ర శాస్త్రం వారికి కొంత సౌలభ్యాన్ని ఇచ్చింది.

**నియమః పురుషే జ్ఞేయా న యోషిత్సు కదాచన**
**న న్యాసా యోషితాం చాత్ర న ధ్యానం న చ పూజనం**
**కేవలం జపమాత్రేణ మంత్రాః సిద్ధ్యన్తి యోసితామ్ ॥**

మంత్ర పురశ్చరణ గురించి ఇంతకు ముందు చెప్పిన నియమాలన్నీ పురుషులకు మాత్రమే. న్యాసం, ధ్యానం, పూజ ఇవేవీ చేయలేక పోయినప్పటికీ స్త్రీలకు కేవలం జపంతోనే మంత్రం సిద్ధిస్తుంది.

అయితే శాస్త్రరీత్యా స్త్రీలకు పై విధంగా వెసులుబాటు కలిగినప్పటికీ అవకాశం వున్నవారు శక్తి కలిగినవారు పంచాంగ పూర్వకంగా పురశ్చరణ చేస్తేనే మంచిది.

**పురశ్చరణ నియమాలు :**

పురశ్చరణ చేసే సాధకులు తాము జపం చేసినన్ని రోజులూ కొన్ని నియమాలు పాటించాలి. అవి ఏమిటంటే....

**భూశయ్యా బ్రహ్మచారిత్వం మౌనమాచార్య సేవనం**
**నిత్యం త్రిషమాణ స్నానం క్షుర కర్మ నిసర్జనం**

భూమి మీద పడుకోవటం, బ్రహ్మచర్యాన్ని పాటించటం, ఎక్కువసేపు మౌనంగా వుండటం, పెద్దల గురువుల సేవ చేయటం, ప్రతిరోజూ మూడుసార్లు స్నానం చెయ్యటం, క్షవరం చేయించుకోకుండా వుండటం అనేవి ప్రధానంగా పాటించాల్సిన నియమాలు. అలాగే ఆహారం కూడా ఒక పూట భోజనం, రాత్రికి ఫలహారం చేస్తే మంచిది.

## గ్రహణ పురశ్చర్య

మంత్ర సాధనలకు సూర్య చంద్ర గ్రహణాలు ఎంతో విశేషమైనవిగా శాస్త్రాలలో చెప్పబడ్డాయి. సాధారణ దినాలలో కంటే అధిక తరమైన ప్రభావాన్ని సూర్య, చంద్ర గ్రహణాలు కలిగి వుంటాయి. కనుక ఈ సమయాలలో మంత్రసాధన ఉత్తమ ఫలితాన్ని సత్వరసిద్ధిని ఇస్తుంది.

**గ్రహణేర్కస్య చేందోర్వా శుచిః పూర్వముపోషితః**
**నద్యాం సముద్రగామిన్యాం నాభిమాత్రోదకే స్థితః**
**స్పర్శాద్విముక్తి పర్యంతం జపేన్మంత్ర మనన్యధీః ॥**

సూర్య లేక చంద్ర గ్రహణాలు కలిగిన సమయంలో నది వద్దగానీ, సముద్రతీరానికి గానీ వెళ్ళి, నదిలోనైతే బొడ్డులోతు నీళ్ళలో నిలబడి, సముద్రం వద్దనైతే తీరంలో దర్భాసనం మీద కూర్చునిగానీ, ఆచమనం ప్రాణాయామం చేసిన తరువాత. **మమోపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ షోడశీ పరదేవతా ముద్దిస్య, శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం - గోత్రోద్భవస్య - నామధేయస్య అహం. శ్రీ షోడశీ పరదేవతా ప్రీత్యర్థం. పవిత్ర - గ్రహణకాలే. స్పర్శాది మోక్షపర్యంతం శ్రీ షోడశీ మంత్ర జపం కరిష్యే...** అని సంకల్పం చెప్పుకుని గ్రహణం ప్రారంభ సమయం నుండి గ్రహణం విడిచేదాకా జపాన్ని చేయాలి. దీనికి ముందు గ్రహణం పట్టు స్నానం - జపం తరువాత విడుపు స్నానం చెయ్యాలి. జపం పూర్తయిన తరువాత ముందు చెప్పిన విధంగానే జపసమర్పణ చెయ్యాలి. దీనిని గ్రహణ పురశ్చర్య అంటారు. గ్రహణం పట్టినప్పటి నుండి విడిచేవరకూ ఉన్న సమయం అది 1 గంటైనా అరగంటైనా ఆ సమయంలో చేసిన జపం (సంఖ్యతో పనిలేదు) 1 లక్ష జపంతో సమానం.

కాబట్టి గ్రహణ సమయాన్ని వినియోగించుకుంటే సాధకులకు మంచిది. గ్రహణం తరువాత రోజు లేదా మంచిరోజు పురశ్చరణలో చెప్పిన విధంగా పదివేల హోమం ఒకవేయి తర్పణం ఒక వంద మార్జనం లేదా అభిషేకం, పది మంది బ్రాహ్మణుల భోజనం యధావిధిగా చేయాలి. **గ్రహణ జపం వల్ల కేవలం జప సంఖ్య మాత్రమే కలిసి వస్తుంది,** హోమాది మిగతా విధులు యధాతథం. కొందరి అభిప్రాయం ప్రకారం గ్రహణ కాలంలో చేసిన జపం పూర్తి పురశ్చర్యతో సమానం.

## శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామివారు తెలియజేసిన హోమ విధానం

శ్రీషోడశీ మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసించే సాధకుడు. పురశ్చరణలో భాగంగా మూలమంత్ర జపంలో దశాంశం హెూమం చేయాలి. అని చెప్పటం జరిగింది. అయితే ఈ హెూమాన్ని ఎలా చేయాలి? హెూమం చేసేడప్పుడు మంత్రాన్ని ఎలా వినియోగించాలి? అంటే...

**హెూమం చేసేటప్పుడు వినియోగించవలసిన షోడశీ మంత్రం**

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం స్వాహా**

హోమం చేసేడప్పుడు మూలమంత్రం చివర ఒక స్వాహా చేర్చి హోమం చెయ్యాలి కాబట్టి షోడశీ మంత్రానికి చివర అదనంగా స్వాహా చేర్చటమైనది.

### హోమాధికారం

శ్రీషోడశీ మంత్రాన్ని పురశ్చరణ పూర్వకంగా ఉపాసించే విధానంలో 'హెూమం' అనేది ఒక ప్రధాన అంగంగా చెప్పబడింది. లోకంలో వైదిక సంప్రదాయాన్ని అనుసరించి ఉపవీతులైన బ్రాహ్మణులు మాత్రమే హోమం చేయటానికి అర్హులు అయితే తంత్రశాస్త్రానుసారంగా జపించిన మంత్రాలతో హోమాన్ని చేయటానికి అన్ని వర్ణాలవారూ అర్హులే. ఈ విషయమే మేరుతంత్రం, మంత్రమహార్ణవం, మంత్ర మహోదధి అనే ప్రసిద్ధ గ్రంథాలు చెబుతాయి.

కనుక (ఈ పుస్తకంలో తెలిపిన విధంగా) తంత్రశాస్త్రానుసారంగా **కుర్తాళం శంకరాచార్య, జగద్గురు శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి** వారు రూపొందించిన హోమవిధాన పద్ధతిలో స్త్రీలు, పురుషులు అన్ని వర్ణాలవారు స్వయంగా హెూమం చేసుకోవచ్చు.

ఇందులో 1) హోమ విధానము 2) లఘుహోమ విధానము అని రెండు పద్ధతులు చెప్పబడ్డాయి. సాధకుల శక్త్యానుసారం, సమయానుసారం ఏ పద్ధతినైనా ఆచరించవచ్చు. ఫలితం ఒక్కటే.

## శ్రీ షోడశీ మంత్ర హోమ విధానము

భారతీయ సంప్రదాయములలో దేవతలకు సంతృప్తిని కలిగించటానికి హోమము చేయటము అత్యంత ప్రధానమైనది. దేవతలు అగ్నిముఖులు అని వేదములో చెప్పబడినది. అగ్నిని ఆవాహనము చేసి మంత్రపూర్వకముగా ఆహుతులు వేసినచో ఏ దేవతకు వేసిన ఆహుతిని ఆ దేవతకు అగ్నిదేవుడు ఇస్తూంటాడు. ఊర్ధ్వ లోకాలలోని దేవతలంతా, హెూమప్రియులు, యజ్ఞములలో కూడా హోమమ ప్రధానమైన అంగము. వైదిక సంప్రదాయములలో ఉపవీతుడైన వ్యక్తికి మాత్రమే హోమము చేసే అధికారము ఉన్నది. ఇతరులకు లేదు. కానీ, తరువాత వచ్చిన తంత్రశాస్త్ర గ్రంథములలో ఉపవీతులు కాని స్త్రీ పురుషులు దేవతానుగ్రహాన్ని వేగంగా పొందటానికి హోమము చేసే పద్ధతులు కూడా చెప్పబడినవి. ఉపనయనము అయినవారిలో కూడా సస్వరముగా వేదము నేర్చుకొని హోమము చేయగలవారు తక్కువ. అందుచేత అందరికి అందుబాటులో ఉండాలనే ఉద్దేశ్యముతో తంత్రశాస్త్ర గ్రంథాలను పరిశీలించి వీలైనంత క్లుప్తంగా, సులభంగా హోమముచేసే పద్ధతిని ఇవ్వటం జరిగింది. దీనిని చక్కగా ఉపయోగించుకొని మంత్రోపాసకులు శీఘ్రముగా దేవతానుగ్రహాన్ని పొంది తమ ఇష్టకామ్యములను సాధించుకొని, విశ్వ కళ్యాణమును ఇహపర శుభములు సాధించుదురు గాక!

### గణపతి స్తుతి

**శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం ।**
**ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥**

### ఆచమనము

ఓం కేశవాయస్వాహా
ఓం నారాయణాయ స్వాహా
ఓం మాధవాయ స్వాహా
ఓం గోవిందాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం సంకర్షణాయ నమః
ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః

ఓం మధుసూదనాయ నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం వామనాయ నమః
ఓం శ్రీధరాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నారసింహాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం జనార్ధాయ నమః
ఓం హరయే నమః
ఓం శ్రీకృష్ణాయ నమః

శ్రీషోడశీ మంత్ర పురశ్చరణలో భాగంగా దశాంశం హోమం చేసేదప్పుడు ఎటువంటి కోరిక కోరకుండా కేవలం శ్రీ షోడశీదేవి ప్రీత్యర్థం, అనుగ్రహ సిద్ధ్యర్థం అని మాత్రమే సంకల్పించి హోమం చేయాలి. పురశ్చరణ అనేది దేవతను వరం కోరుకోవటానికి అర్హత మాత్రమే. ఒకసారి పురశ్చరణ పూర్తయినాక సాధకులు ఎప్పుడైనా ఎన్నిసార్లయినా కామ్య హోమాన్ని చేసుకోవచ్చు.

## హోమ సంకల్పము

అస్యశ్రీ మహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే మేరోః దక్షిణ దిగ్భాగే - దేశే భగవత్సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన - సంవత్సరే ఆయనే - ఋతౌ - మాసే పక్షే - తిథౌ - వాసరే - నక్షత్రే శుభయోగే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్టాయాం - గోత్రోద్భవస్య - నామధేయస్య అహం శ్రీషోడశీపరదేవతా ప్రీత్యర్థం, శ్రీషోడశీపరదేవతా మూలమంత్ర హోమం కరిష్యే.

## కలశపూజ

కలశస్యముఖే విష్ణుః కంఠే రుద్రస్సమాశ్రితః ।
మూలే తత్రస్థితో బ్రహ్మ మధ్యే మాతృగణాః స్మృతాః ॥
కుక్షౌతు సాగరా స్సర్వే సప్తద్వీపా వసుంధరా ।
ఋగ్వేదో థ యజుర్వేదః సామవేదో హ్యథర్వణః ॥

అంగైశ్చ సహితా సర్వే కలశాంబు సమాశ్రితాః ।
ఆయాంతు దేవపూజార్థం దురితక్షయ కారకాః ॥
గంగే చ యమునే చైవ గోదావరి సరస్వతి ।
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు ॥

ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం
ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.
ఓం ఆపోజ్యోతీరసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్.

**దీప ప్రజ్వలనం :**

ముందుగా ఒక ప్రమిద లేదా కుందిలో ఆవునేతితో దీపారాధన చెయ్యాలి. ఈ దీపం, హోమం పూర్తయ్యే వరకు వెలుగుతూ ఉండేలా చూడాలి.

## గురుస్తుతి

గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥

## శ్రీ షోడశీ మంత్ర న్యాసములు

| కరన్యాసం | | హృదయన్యాసం |
|---|---|---|
| హ్రీం శ్రీం అం | అంగుష్ఠాంభ్యాం నమః | శ్రీం హ్రీం క్లీం ఐం సౌః హృదయాయ నమః |
| హ్రీం శ్రీం ఆం | తర్జనీభ్యాం నమః | ఓం హ్రీం శ్రీం శిరసే స్వాహా |
| హ్రీం శ్రీం అం | మధ్యమాభ్యాం నమః | క ఏ ఈ ల హ్రీం శిఖాయై వషట్ |
| హ్రీం శ్రీం ఆం | అనామికాభ్యాం నమః | హ స క హ ల హ్రీం కవచాయ హుం |
| హ్రీం శ్రీం సౌః | కనిష్ఠికాభ్యాం నమః | స క ల హ్రీం నేత్రత్రయాయౌషట్ |
| హ్రీం శ్రీం సౌః | కరతలకర పృష్ఠాభ్యాం నమః | సౌః ఐం క్లీం హ్రీం శ్రీం అస్త్రాయఫట్ |

భూర్భు వస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానమ్ :**

**బాలార్కాయుత తేజసం త్రినయనాం రక్తాంబరోల్లాసినీం**
**నానాలంకృతి రాజమానవసుధాం బాలేందు యుక్ శేఖరాం**
**హస్తైరిక్షు ధనుస్సృణిం సుమశరాం పాశం ముదా బిభ్రతీం**
**శ్రీచక్రస్థిత సుందరీం త్రిజగతామాధారభూతాం స్మరేత్ ॥**

## హోమకుండపూజ

హోమకుండమునగానీ, స్థండిలమున గాని సంస్కార చతుష్టయము చేయవలెను. మధ్యలో బియ్యపు పిండితో ప్రాదేశమాత్రపు (బొటనవ్రేలు, చూపుడువ్రేలు చాచినప్పుడు మధ్యలో ఉండే దూరము) చతురస్రము తయారు చేయవలెను.

**వీక్షణము :**

| |
|---|
| శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం |

అని మూలమంత్రమును ఉచ్చరించుచు కుండమును చూడవలెను.

**ప్రోక్షణము :** **ఫట్** అని ఉచ్చరించుచు దర్భలతో నీళ్ళు చల్లవలెను.

**తాడనము :** దర్భలతో **ఫట్** అని మూడుసార్లు ఉచ్చరిస్తూ కుండము లోపలి భాగమును కొట్టవలెను.

**అభ్యుక్షణము :** **హుం** అని ఉచ్చరించుచు పిడికిలితో నీళ్ళు కుండమంతట చల్లవలెను. మరల పై తెలిపిన శ్రీ షోడశీ మూల మంత్రాన్ని ఉచ్చరిస్తూ **"శ్రీ షోడశీ పరదేవతా హోమకుండాయనమః"** అని కుండమునకు నమస్కరించవలెను.

తూర్పువైపు దర్భల చివరలు వచ్చుచున్నట్లుగా పడమట నుంచి తూర్పు వైపుకు మూడు గీతలు బియ్యపు పిండితో దర్భతో గీయవలెను. ఉత్తరపు వైపు దర్భ చివరలు వచ్చునట్లుగా మొదట గీసిన గీతలపై దక్షిణము నుంచి ఉత్తరము వైపు మూడు గీతలు గీయవలెను.




ఆ దర్భలను త్రుంచి నైరుతి దిక్కువైపునకు వేయవలెను.

తూర్పు రేఖలు చివరల మూడింటిని–**ముకుందాయ నమః, ఈశాయ నమః, పురందరాయ నమః** అని ప్రదక్షిణ క్రమమున పూజించవలెను.

ఉత్తారగ్రములో – **బ్రహ్మణేనమః, వైవస్వతాయనమః, ఇంద్రవేనమః** అని పూజించవలెను.

**ఓం హ్రీం ఓం** అని కుండ మధ్యమున వ్రాసి **శ్రీషోడశీ మంత్రమును** ఉచ్చరించుచు పుష్పాంజలి సమర్పించవలెను.

## అగ్నిప్రతిష్ఠాపనము

హోమాంగత్వేన అగ్ని ప్రతిష్ఠాపనం కరిష్యే – అని సంకల్పం చేయవలెను,... అస్య శ్రీ వైశ్వానర మహామంత్రస్య భృగు ఋషిః, దైవీ గాయత్రీ ఛందః, శ్రీ వైశ్వానరో దేవతా, **రం** బీజం, **స్వాహా** శక్తిః **జాతవేద** ఇతి కీలకం స్వేచ్ఛాప్రయోగ సిద్ధ్యర్థే హోమే వినియోగః అని సంకల్పంచేసి తరువాత అగ్నిన్యాసం చేయవలెను.

## అగ్ని న్యాసము

**ఈ క్రింద తెలిపిన మంత్రాలతో కరన్యాసం, హృదయన్యాసం చేయవలెను**

**1.**ఓం **రాం** సహస్రార్చిషే అంగుష్ఠాభ్యాం నమః, **2.**ఓం **రీం** స్వస్తిపూర్ణాయ తర్జనీభ్యాం నమః, **3.**ఓం **రూం** ఉత్తిష్ఠ పురుషాయ మధ్యమాభ్యాం నమః **4.**ఓం రైం ధూమవ్యాపినే అనామికాభ్యాం నమః **5.** ఓం రౌం సప్తజిహ్వాయ **కనిష్ఠికాభ్యాం నమః 6.** ఓం రః ధనుర్ధరాయ కరతల కరపృష్ఠాభ్యాం నమః (ఇదే విధంగా హృదయన్యాసం కూడా చేయవలెను.)

**భూర్భువస్సువరోమితి దిగ్బంధః**

## అగ్నిపీఠ పూజ (కుండములో దశదిక్కుల యందు అక్షతలతో)

1. ఓం పీతాయై నమః
2. ఓం శ్వేతాయై నమః
3. ఓం అరుణాయై నమః
4. ఓం కృష్ణాయై నమః
5. ఓం ధూమ్రాయై నమః
6. ఓం తీవ్రాయై నమః
7. ఓం విస్ఫులింగిన్యై నమః
8. ఓం రుధిరాయై నమః
9. ఓం జ్వాలిన్యై నమః
10. ఓం రం సర్వశక్తి కమలాసనాయై నమః

## ఆసన పూజ - (అక్షతలతో)

**రం వహ్న్యాసనాయనమః** - అని అగ్ని ఆసనమునకు నమస్కరించవలెను. సపరివారం అగ్నిం ఆవాహయామి అని ఆవాహనం చేయవలెను. అగ్నిని మూతగల పాత్రలో **'ఫట్ ఫట్'** అని ఉచ్చరించుచు తెచ్చి, **'హుం-హుం'** అని మూత తీసి, **'రం రం'** అని ఉచ్చరించుచు కుండము దగ్గరకు తీసుకొని రావలెను.

పరమాత్మానలముతోను, జఠరాగ్నితోను, అంతరాగ్నితోను ఈ అగ్నియొక్క సమైక్యమును సంభావించి, అగ్ని బీజమగు **రం** ఉచ్చరించుచు వహ్ని చైతన్యమును భావించవలెను.

అగ్నిని **ఓంకారము**తో అభిమంత్రించి, ఉచ్చరించుచు అమృతబీజమైన **వం**-తో అమృతీకరించి ఉచ్చరించుచు, ఈ అగ్ని లలాటం నుంచి కుండములోనికి దిగుచున్నట్లుగా భావించి, ఎనిమిదిసార్లు ప్రణవంతో **(ఓం)** మరల అభిమంత్రించి **హుం ఫట్** అని రక్షాకవచమును భావించి **"రం వహ్నిమూర్తయే నమః"** అని మనస్సులో అగ్నికి నమస్కరించి **ఓం ఓం ఓం** అని ఉచ్చరించుచు కుండముపై నిప్పు పళ్ళెమును ప్రదక్షిణ పద్ధతిలో మూడుసార్లు త్రిప్పవలెను.

**హూంఫట్ క్రవ్యా దేభ్యః స్వాహా** అనుచు కొంత నిప్పు తీసి నైరుతి దిక్కున వేయవలెను.

**భూర్భువస్సువరోం** అనియు, **హ్రూం-వహ్ని చైతన్యాయ నమః,** అనియు ఉచ్చరించుచు కుండమున అగ్నిని ఉంచవలెను.

కుండము బైట (నిప్పు పళ్ళెములో) అక్షతలు, నీళ్ళు వదలవలెను.

**చిత్పింగళ హనహన దహదహ పచపచ సర్వజ్ఞ ఆజ్ఞాపయ స్వాహా. హ్రీం హ్రీం జ్వల జ్వల ప్రజ్వల ప్రజ్వల హుంఫట్ స్వాహా** – అని మంత్రములను పఠించవలెను. ఆ తరువాత లేచి నిలుచుండి జ్వాలినీముద్ర ప్రదర్శించి నమస్కరించుచు

**అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం ।**
**సువర్ణ వర్ణ మమలం సమిద్ధం విశ్వతోముఖం ॥**

**"ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా"** అనుచు అర్ఘ్యపాద్యములతో పూజించవలెను.

## లమిత్యాది పంచపూజలు

పంచపాత్రలో నీటిని ఉద్ధరిణతో తీసుకుని ఓం అగ్నయే నమః **పాద్యం** సమర్పయామి **అర్ఘ్యం** సమర్పయామి **ఆచమనం** సమర్పయామి అంటూ అరివేణం (పళ్ళెం)లో వేయాలి.

**లం** పృథివీ తత్వాత్మికాయ నమః **గంధం** ధారయామి
**హం** ఆకాశ తత్వాత్మికాయ నమః **పుష్పైః** పూజయామి
**యం** వాయు తత్వాత్మికాయ నమః **ధూపం** అఘ్రాపయామి
**రం** తేజస్తత్వాత్మికాయ నమః **దీపం** దర్శయామి

అంటూ గంధాన్ని, పుష్పాలను, అగరబత్తీలను లేదా సాంబ్రాణీని హెూమకుండంలో వేసి దీపారాధన చేసిన దీపాన్ని హెూమకుండానికి చూపాలి.

**ధూపదీపానంతరం ఆచమనం సమర్పయామి**

**వం** అమృతతత్వాత్మికాయ నమః అమృత **నైవేద్యం** సమర్పయామి అంటూ నైవేద్యాన్ని హోమకుండంలో సమర్పించాలి. (సున్నుండ లేక పండు).

ఒక దర్భ కాల్చి జ్వాలను నేతిలో ప్రతిఫలింపజేసి, దర్భను కుండములో వేయవలెను, నేతిపాత్రలో రెండు చిన్న దర్భాగ్రములు వేయవలెను. అపుడు నెయ్యి మూడు భాగములు అగును. ఎడమవైపు ఇడ, కుడివైపు పింగళ, మధ్య సుషుమ్న అని భావించవలెను.

స్రువముతో కుడిభాగము నుండి **'నమః'** అని నేతిని తీసుకొని **ఓం అగ్నయే స్వాహా** - అని ఆహుతి వేయుచు అగ్ని యొక్క ఎడమకన్ను తెరువబడినట్లుగా భావించవలెను.

స్రువముతో మధ్యభాగము నుండి **'నమః'** అనుచు నేతిని తీసుకొని **ఓం అగ్నీషోమాభ్యాగ్ం స్వాహా** - అని ఆహుతి వేయుచు అగ్ని యొక్క మధ్యనేత్రం (మూడవకన్ను) తెరువబడినట్లుగా భావించవలెను.

కుడివైపు నుండి **'నమః'** అని నేతిని తీసుకొని **ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా** అని అగ్ని ముఖమున ఆహుతి వేయవలెను. ఆ తరువాత

మధ్యభాగము నుండి నేతిని తీసుకొని

**ఓం భూః స్వాహా, ఓం భువః స్వాహా**

**ఓం సువః స్వాహా, ఓం భూర్భువస్సువః స్వాహా**

అని 4 ఆహుతులు వేయవలెను.

**ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వ కర్మాణి సాధయస్వాహా** అని మూడుసార్లు ఆహుతులు వేయవలెను.

## జిహ్వాహోమము (సాత్విక జిహ్వలు)

1. ఓం స్ర్యూం హిరణ్యాయై స్వాహా
2. ఓం ఫ్ర్యూం గగనాయై స్వాహా
3. ఓం శ్రూం రక్తాయై స్వాహా
4. ఓం వ్ర్యూం కృష్ణాయై స్వాహా
5. ఓం ల్ర్యూం సుప్రభాయై స్వాహా
6. ఓం ర్ర్యూం అతిరక్తాయై స్వాహా
7. ఓం య్ర్యూంబహురూపాయై స్వాహా

## - రాజస జిహ్వలు -

1. ఓం స్ర్యూం పద్మరాగాయై స్వాహా
2. ఓం ఫ్ర్యూం సువర్ణాయై స్వాహా
3. ఓం శ్రూం భద్రలోహితాయై స్వాహా
4. ఓం వ్ర్యూం లోహితాయై స్వాహా
5. ఓం ల్ర్యూం శ్వేతాయై స్వాహా
6. ఓం ర్ర్యూం ధూమిన్యై స్వాహా
7. ఓం య్ర్యూం కరాళికాయై స్వాహా

## - తామస జిహ్వలు -

1. ఓం హ్స్ర్యాం విశ్వమూర్త్యై స్వాహా
2. ఓం హ్ఫ్ర్యాం విస్ఫులింగిన్యై స్వాహా
3. ఓం హ్శ్రూం ధూమ్రవర్ణాయై స్వాహా
4. ఓం హ్ప్ర్యాం మనోజవాయై స్వాహా
5. ఓం హ్ల్ర్యాం లోహితాయై స్వాహా
6. ఓం హ్ర్ర్యాం కరాళ్యై స్వాహా
7. ఓం హ్య్ర్యాం కాళ్యై స్వాహా

**సాత్విక - రాజస - తామస జిహ్వలు ఇష్టప్రాప్తి, అనిష్ట పరిహారము అభిచార ప్రయోజనములకు ఉద్దేశించబడినవి.**

## - జిహ్వాధిదేవతా హోమము -

1. ఓం సురేభ్యః స్వాహా
2. ఓం పితృభ్యః స్వాహా
3. ఓం గంధర్వేభ్యః స్వాహా
4. ఓం యక్షేభ్యః స్వాహా
5. ఓం నాగేభ్యః స్వాహా
6. ఓం పిశాచేభ్యః స్వాహా
7. ఓం రాక్షసేభ్యః స్వాహా

## - షడంగ దేవతా హోమము -

1. ఓం **రాం** సహస్రార్చిషే హృదయాయ నమః స్వాహా
2. ఓం **రీం** స్వస్తిపూర్ణాయ శిరసే స్వాహా స్వాహా
3. ఓం **రూం** ఉత్తిష్ఠ పురుషాయ శిఖాయై వషట్ స్వాహా
4. ఓం **రైం** ధూమవ్యాపినే కవచాయ హుం స్వాహా
5. ఓం **రౌం** సప్తజిహ్వాయ నేత్రత్రయాయ వౌషట్ స్వాహా
6. ఓం **రః** ధనుర్ధరాయ అస్త్రాయ ఫట్ స్వాహా

## - అష్టమూర్తి హోమము -

1. ఓం అగ్నయే జాతవేదసే స్వాహా
2. ఓం అగ్నయే సప్తజిహ్వాయ స్వాహా
3. ఓం అగ్నయే హవ్యవాహనాయ స్వాహా
4. ఓం అగ్నయే అశ్వోదరజాయ స్వాహా
5. ఓం అగ్నయే వైశ్వానరాయ స్వాహా

6. ఓం అగ్నయే కౌమారజాతసే స్వాహా
7. ఓం అగ్నయే విశ్వముఖాయ స్వాహా
8. ఓం అగ్నయే దేవముఖాయ స్వాహా

## - అష్టమాతృక హోమము -

1. ఓం అం బ్రాహ్మ్యై స్వాహా
2. ఓం ఈం మహేశ్వర్యై స్వాహా
3. ఓం ఊం కౌమార్యై స్వాహా
4. ఓం ఋూం యక్షేభ్యః స్వాహా
5. ఓం ఌం వారాహ్యై స్వాహా
6. ఓం ఐం ఇంద్రాణ్యై స్వాహా
7. ఓం ఔం చాముండాయై స్వాహా
8. ఓం అః మహాలక్ష్మ్యై స్వాహా

## - అష్టభైరవ హోమము -

1. ఓం అం అసితాంగ భైరవాయ స్వాహా
2. ఓం ఇం రురు భైరవాయ స్వాహా
3. ఓం ఉం చండ భైరవాయ స్వాహా
4. ఓం ఋం క్రోధ భైరవాయ స్వాహా
5. ఓం ఌం ఉన్మత్త భైరవాయ స్వాహా
6. ఓం ఐం కపాల భైరవాయ స్వాహా
7. ఓం ఓం భీషణ భైరవాయ స్వాహా
8. ఓం అః సంహార భైరవాయ స్వాహా

## - దిక్పాలక హోమము -

1. ఓం లం ఇంద్రాయ స్వాహా
2. ఓం రం అగ్నయే స్వాహా
3. ఓం హాం యమాయ స్వాహా
4. ఓం షం నిర్బృతయే స్వాహా
5. ఓం వం వరుణాయ స్వాహా
6. ఓం యం వాయవే స్వాహా
7. ఓం సం సోమాయ స్వాహా
8. ఓం శం ఈశానాయ స్వాహా
9. ఓం ఆం బ్రహ్మణే స్వాహా
10. ఓం హ్రీం అనంతాయ స్వాహా

## - దిక్పాలకాయుధ హోమము -

1. ఓం వజ్రాయ స్వాహా
2. ఓం శక్త్యై స్వాహా
3. ఓం దండాయ స్వాహా
4. ఓం ఖడ్గాయ స్వాహా
5. ఓం పాశాయ స్వాహా
6. ఓం అంకుశాయ స్వాహా
7. ఓం గదాయై స్వాహా
8. ఓం శూలాయ స్వాహా
9. ఓం పద్మాయ స్వాహా
10. ఓం చక్రాయ స్వాహా

ఈ విధంగా హోమాన్ని ఆచరించిన తరువాత స్రువముతో నాలుగుసార్లు నేతిని తీసుకొని స్రుక్కునందు వేసి స్రువమును స్రుక్కుపై బోర్లించి దానియందు ఒక పువ్వును ఉంచి రెండు చేతులతో వామస్తనము ఎత్తువరకు పట్టుకుని లేచి కుడికాలు ముందుకు వేసి **"ఓం వైశ్వానర జాతవేద ఇహా వహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ వౌషట్"** అని హెూమము చేయవలెను. తరువాత కూర్చుని కుందానికి నమస్కరించి చేతిలో అక్షతలు నీరు తీసుకొని కుండమునకు (అగ్నికి) తూర్పున నీళ్ళు మాత్రమే ఉంచి పశ్చిమాన అక్షతలు వేయవలెను.

**ప్రాఙ్ముఖాగ్నే మమ అభిముఖోభవ, సుముఖోభవ**
**సుప్రసన్నోభవ, వరదో భవ, యథోక్త జిహ్వాయా**
**హవిర్గృహాణ ॥ఓం భూర్భువస్సువః**

అని నీళ్ళు చల్లి నీళ్ళతో అగ్నికి చుట్టూ ప్రదక్షిణ పద్ధతిన త్రిప్పవలెను.

## - కుండమేఖలా పూజ -

1. తూర్పున-అగ్నయే నమః
2. ఆగ్నేయాన-హుతవహాయ నమః
3. దక్షిణాన-హుతాశినే నమః
4. నైరుతిన-కృష్ణవర్త్మనే
6. పశ్చిమాన-దేవముఖాయ నమః
7. వాయువ్యాన-సప్తజిహ్వాయ నమః
8. ఉత్తరాన - వైశ్వానరాయ నమః
9. ఈశాన్యాన-జాతవేదసే నమః

అనుచు ఎనిమిది దిక్కులయందు అక్షతలతో కుండముపై పూజ చేయవలెను. దర్భల కొనలు తూర్పు వైపునకుగానూ, ఉత్తరవైపునకుగానూ ఉండేటట్లు నాలుగు వైపుల వేయవలెను.

## - మహా గణపతి హోమము -

1. ఓం స్వాహా
2. ఓం శ్రీం స్వాహా
3. ఓం శ్రీం హ్రీం స్వాహా
4. ఓం శ్రీం హ్రీం క్లీం స్వాహా
5. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం స్వాహా
6. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం స్వాహా
7. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే స్వాహా
8. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద స్వాహా
9. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం స్వాహా
10. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే స్వాహా
11. ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా స్వాహా

అని చెబుతూ 11 సార్లు ఆహుతులు వేయవలెను.
పిమ్మట నాలుగుపర్యాయములు పూర్తి గణపతి మంత్రముతో ఆహుతులు వేయవలెను.

## - ప్రధాన దేవతా హోమము -

శ్రీ గురుభ్యోనమః అని గురువునకు నమస్కరించి ఓం శ్రీ షోడశీ దేవతా యోగపీఠాయ నమః అని ఒక మారు ఆహుతిగానీ, అక్షతలుగానీ వేయవలెను.

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం**
**హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం**

అని శ్రీ షోడశీ మంత్రమును పదిసార్లు ఉచ్చరించి దానితో దేవతను అగ్నియందు అవతరింప చేయవలెను. దేవతా యంత్రమును కుండమునందు భావించి దేవతా ప్రాణ ప్రతిష్ఠ చేయవలెను.

ఓం ఆ హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం
ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః శ్రీ షోడశీపరదేవతా ప్రాణా ఇహ ప్రాణాః

ఓం అం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం
ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః శ్రీషోడశీదేవతా జీవ ఇహస్థితః
ఓం అం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం
ఓం క్షం సం హం సః హ్రీం ఓం హం సః
శ్రీ షోడశీ పరదేవతా సర్వేంద్రియాణి వాఙ్మనః చక్షుశ్శ్రోత్ర
ఘ్రాణ ప్రాణా ఇహైవ ఆగత్య సుఖం చిరంతిష్ఠంతు స్వాహా
ఓం క్షం సం హం సః హ్రీం ఓం

పై మొత్తము మంత్రమును మూడుసార్లు జపించుచు కుండముపై చేయి వుంచి ప్రాణప్రతిష్ఠ చేయవలెను. ఆ తరువాత లమిత్యాది పంచపూజ చేయవలెను.

## లమిత్యాది పంచపూజలు

పంచపాత్రలో నీటిని ఉద్ధరిణతో తీసుకుని శ్రీషోడశీ పరదేవతాయై **పాద్యం** సమర్పయామి **అర్ఘ్యం** సమర్పయామి **ఆచమనం** సమర్పయామి అంటూ హోమకుండంలో ఒక ప్రక్కగా వేయాలి.

**లం** పృథివీ తత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై గంధం ధారయామి
**హం** ఆకాశతత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై పుష్పైః పూజయామి
**యం** వాయుతత్వాత్మికాయ శ్రీ షోడశీ పరదేవతాయై ధూపం అఘ్రాపయామి
**రం** తేజస్తత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై దీపం దర్శయామి

ధూపదీపానంతరం ఆచమనం సమర్పయామి

**వం** అమృతతత్వాత్మికాయై శ్రీ షోడశీ పరదేవతాయై అమృత నైవేద్యం సమర్పయామి అని చెబుతూ గంధాన్ని, పుష్పాన్ని, ధూపాన్ని (అగరుబత్తి / సాంబ్రాణీ) హోమకుండంలో వేసి దీపారాధన చేసిన దీపాన్ని చూపి, నైవేద్యంగా సున్నుండను కాని, పండ్ల ముక్కలను కాని హెూమకుండములో వేయాలి.

ఇప్పుడు **అగ్ని - శ్రీషోడశీపరదేవతా ఏకీకరణార్థం పంచవింశతి ఆహుతిం హోష్యామి** అని అగ్నికి దేవతకు వక్త్ర ఏకీకరణమును సంకల్పించి మూలమంత్రముతో 25 ఆహుతులు వేయవలెను. తరువాత **అగ్ని-శ్రీషోడశీదేవతా నాడీ సంధానార్థం ఏకాదశ ఆహుతిం హోష్యామి** అని నాడీ సంధానమును సంకల్పించి, శ్రీషోడశీ

మంత్రముతో 11 ఆహుతులు వేయవలెను. ఇప్పటికి అగ్నికి దేవతకు ఏకీకరణము జరిగినట్లుగా భావింపవలెను.

**ఓం మందూకాది పరతత్వాంత పీఠదేవతాభ్యఃస్వాహా**

అని ఒక ఆహుతి వేయవలెను.

ఏ ప్రదేశంలో అయితే హోమం చేస్తామో ఆ ఆవరణలోనే దేవతలకు ఆ పీఠంలోని దేవతలకు **ఓం సమస్త ఆవరణ దేవతాయై స్వాహా, ఓం సమస్త పీఠ దేవతాయై స్వాహా** అని పీఠదేవతలకు, ఆవరణ దేవతలకు ఒక్కొక్క ఆహుతి సమర్పించవలెను. అనంతరం **శ్రీ షోడశీ మూల మంత్రంతో**

10 ఆజ్యాహుతులు వేయవలెను. ఆ తరువాత కామ్య ద్రవ్యములతో హోమము చేయవలెను.

అగ్ని, దేవతా సంధానము చేయబడినది గనుక హోమములో **"ఇదం న మమ"** అని త్యాగము చెప్పవలసి పనిలేదు.

## - హోమ ప్రారంభం -

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం స్వాహా ।

మూలమంత్రం చివర స్వాహా అని ఉచ్చరించుచు ఆహుతులు వేయవలెను. కార్యసిద్ధిని బట్టి ఆహుతుల సంఖ్యను నిర్ణయింపవలెను.

## - హోమాంత విధి -

ఇలా మూలమంత్రంతో హోమం పూర్తిచేసిన తరువాత హోమ పరిపూర్ణత కొరకు జయాది మంత్రములతో హోమము చేయవలెను. జయాదుల బదులుగా మహావ్యాహృతి హోమము, బ్రహ్మార్పణ మంత్రహోమము చేయవచ్చును.

## - మహావ్యాహృతి హోమము -

ఓం భూః అగ్నయే చ పృధివ్యైచ మహతే చ స్వాహా
ఓం భువః వాయవే చ అంతరిక్షాయ చ మహతే చ స్వాహా
ఓం సువః ఆదిత్యాయ చ దివే చ మహతే చ స్వాహా
ఓం భూర్భువస్సువః చంద్రమసే చ నక్షత్రేభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతేచ స్వాహా
అని 4 ఆహుతులు వేయవలెను.

## - బ్రహ్మార్పణ మంత్రహోమము -

**ఓం తత్సత్ ఇతః పూర్వం ప్రాణబుద్ధి దేహ ధర్మాధికార జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసు మనసా వాచా కర్మణా యత్ స్మృతం యదుక్తం యచ్చకృతం తత్సర్వం బ్రహ్మార్పణం భవేత్. భూః స్వాహా స్వాహా**

అనుచు **8** ఆహుతులు వేయవలెను.

## - దేవతా బలి -

పూర్ణాహుతి ముందు 'మంచి గుమ్మడికాయ' మంత్ర పూర్వకముగా ఖండించి సమర్పించవచ్చును. ఇది ఆటంకములను, ఆపదలను తొలగించి అభీష్టములను ప్రసాదించును. లేదా కొబ్బరికాయ పూర్తిగా పీచుతీసి కుంకుమరాసి పగులకొట్టకుండ

**శ్రీ షోడశీ పరదేవతాయై బలిం సమర్పయామి**

అంటూ కుండములో వేయవలెను.

## కూష్మాండబలి విధానము

మంచి గుమ్మడికాయకు కుంకుమరాసి సిద్ధం చేయవలెను.

**సంకల్పం :** శ్రీషోడశీ పరదేవతా ప్రీత్యర్థం కూష్మాండ బలిదానం కరిష్యే అనవలెను. శ్రీషోడశీదేవతకు పంచోపచారములతో పూజచేసి దేవతకు ఎదురుగా కాని లేక ఉత్తర ముఖముగాగాని నిల్చుండి గుమ్మడికాయను పీటపైపెట్టి **ఓంకూష్మాండబలయే నమః** అని బలిపశువును ఆవాహన చేసి పూలతో, అక్షతలతో పూజచేయవలెను. ఈ క్రింది శ్లోకములను చదవాలి.

శ్లో॥ **పశుస్త్వం బలిరూపేణ మమ భాగ్యా దవస్థితః**
**ప్రణమామి తత స్సర్వ రూపిణం బలిరూపిణీం**
**శ్రీ షోడశీ ప్రీతిదానేన దాతురాపద్వినాశనం**
**శ్రీ షోడశీ బలిరూపాయ బలే ! తుభ్యం నమోస్తుతే.**
**యజ్ఞార్థం పశవ స్సృష్టాః స్వయమేవ స్వయంభువా**
**అతస్త్వాం ఘాతయా మ్యద్య తస్మాత్ యజ్ఞే వధోఽ వధః**

తరువాత కత్తికికుంకుమరాసి పూలతో, అక్షతలతో పూజించి ఈ క్రింది మంత్రము చెప్పవలెను.

**ఐం హ్రీం శ్రీం రసనాత్వం షోడశ్యాః సురలోక ప్రసాదకః హ్రాం హ్రీం ఖడ్గ అం హుం ఫట్** అని పలుకుతూ కత్తిని చేతిలో పట్టుకొని ఈ క్రింది మంత్రము

**ఓం కాళికాళి వజ్రేశ్వరి లోహదండాయై నమః**

చెప్పుచూ కండ్లు మూసుకొని గుమ్మడికాయను నరుకవలెను.

తెగిన రెండు ముక్కలలో ఒక ముక్కను అమ్మవారి ముందుంచి కుంకుమ, నీరు చల్లి నెత్తురు వలె కనిపించేలా చేసి, **కౌశికీ రుధిరేణ అప్యాయతాం** - అని చెబుతూ ఆముక్క మీద కర్పూరం వెలిగించి ఆముక్కని హోమకుండంలో వేయాలి.

మిగిలిన ముక్కను 5 భాగములు చేసి - ఈ క్రింది మంత్రములతో పూజ చేయవలెను.

**1) పూతనాయై బలిం నివేదయామి. 2) చరక్యై బలిం నివేదయామి.**
**3) విదార్యై బలిం నివేదయామి. 4) పాపరాక్షస్యై బలిం నివేదయామి.**
**5) ఓం హ్రీం స్ఫుర ఓం హ్రీం ఓం హుం ఫట్ మర్ద మర్ద హుం-శేషం రక్షోభ్యో హరేత్.**

పై వాటిలో 4 ముక్కలను బలిగా నివేదించి, ఐదోముక్కను చేతితో తాకకుండా ఒక కవర్‌గానీ ఏదైనా పేపర్‌తోనైనా పట్టుకొని హోమశాల బైట పడవేయాలి. తిరిగి కాళ్ళు కడుక్కుని హోమశాలలో ప్రవేశించాలి.

ఈ విధంగా కుష్మాండబలి ఇవ్వలేనివారు ఒకమంచి గుమ్మడికాయకు కుంకుమరాసి పంచపూజలు చేసి శ్రీషోడశీమూలమంత్రం చెబుతూ హోమకుండంలో వేయవచ్చు. ఇది కూడా కూష్మాండబలితో సమానమైన ఫలితాన్నిస్తుంది.

## - పూర్ణాహుతి -

పూర్ణాహుతిని సంకల్పించి **'పూర్ణాహుతిం జుహోమి'** అని అనవలెను.

పళ్ళెమునందు కొబ్బరికాయగానీ, ఖర్జూరపు కాయగానీ, పోకకాయగాని ఉంచి అక్షతలు, జాజికాయ, పట్టుగుడ్డ, పూలు, జాపత్రి మున్నగు సుగంధ ద్రవ్యాలను పూర్ణాహుతికి ఉపయోగించవచ్చును.

పూర్ణాహుతి ద్రవ్యాన్ని ఒక దేవతగా భావించి ధూపదీప నైవేద్యములను సమర్పించవలెను. 12సార్లు మూలమంత్రముతో నేతిని తీసుకొని పూర్ణాహుతి ద్రవ్యపు కాయపై పోయవలెను. ఈ సందర్భమున స్రుక్కునందు స్రువముతో 12సార్లు నేతిని వేసి పూర్ణాహుతి చేయుట ఆచారం. లేచి నుంచొని

**శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం వౌషట్**

అని మూలమంత్రమును ఉచ్చరించుచు పూర్ణాహుతి ద్రవ్యాన్ని హోమకుండములో వేయవలెను. ఇంతటితో పూర్ణాహుతి పూర్తి అయినది.

హోమసమయాన అగ్నిజ్వాలతో బాగా విజృంభించినట్లు చూచుకొనవలెను. అయినను అప్పుడప్పుడు వాడిన ద్రవ్యాలను బట్టి జ్వాలలు బాగా ఉండకపోవచ్చును. కనుక, అగ్నివిహరణ దోషనిరసనార్థము శ్రీషోడశీ మంత్రముతో **25** ఆజ్యాహుతులను వేయవలెను. ***తరువాత ఆవరణ దేవతలకు ఆహుతులు వేయవలెను.***

## - దిక్పాలక బలి -

పూర్ణాహుతి అనంతరము, దిక్పాలకులకు ఎర్ర అన్నము ముద్దగాని, కోసి కుంకుమ అద్దిన నిమ్మకాయడిప్పగాని, గారెలు గాని ఈ క్రింది మంత్రములు చెప్పుచూ

బలి సమర్పించవలెను. కుండము బయట ఎనిమిది దిక్కులలో తమలపాకులు పెట్టి ఆయాదిక్కులలో వరుసగా బలి సమర్పణ చేయవలెను.

1. తూర్పు-**లం** ఇంద్రాయ నమః
2. ఆగ్నేయము-**రం** ఆగ్నేయ నమః
3. దక్షిణము-**హం** యమాయ నమః
4. నైఋతి-**షం** నిఋతయే నమః
5. పడమర-**వం** వరుణాయ నమః
6. వాయవ్యము-**యం** వాయవే నమః
7. ఉత్తరం-**సం** సోమాయ నమః
8. ఈశాన్యము-**శం** ఈశానాయ నమః
9. ఊర్ధ్వం-**అం** బ్రహ్మణే నమః
10. అధో-**హ్రీం** అనంతాయ నమః

(ఈ పది దిక్కుల మంత్రాలకు చివర వున్న **నమః** తరువాత **బలిం సమర్పయామి** అని చెప్పవలెను)

## - భూత బలి -

హోమకుండానికి ఈశాన్యమున ఆకువేసి పెద్ద ఎర్ర అన్నము ముద్దపెట్టి ఈ క్రింది మంత్రముతో భూతములకు బలి సమర్పించవలెను. లేదా కొబ్బరికాయకొట్టి కుంకుమవేసి నీరుచల్లి బలిని సమర్పించవచ్చును.

**యే రౌద్రా రౌద్రకర్మాణో రౌద్రస్థాన నివాసినః**
**యోగినోహ్యుగ్రరూపాశ్చ గణానాం అధిపాశ్చయే**
**భూచరాః ఖేచరాశ్చైవ యే తిష్ఠంత్యంతరిక్షగాః**
**తే సర్వే ప్రీతమనసో భూత్వా గృహ్ణాం త్విమం బలిం**
**సర్వ విఘ్నకృద్భ్యః సర్వభూతేభ్యో హుంఫట్ స్వాహా**

అని చెప్పుచూ అక్షతలు, నీళ్ళు వదలవలెను. ఇక్కడ కొబ్బరికాయను భూతబలి కొరకు ఉపయోగించవచ్చును.

దిక్పాలిక బలిక్రింద మినుములు, పెరుగు కలిపి యిచ్చుట కొన్నిచోట్ల ఆచారము. నిమ్మకాయ కోసి కుంకుమ అద్ది కూడ ఇయ్యవచ్చును.

**చివరగా హోమకుండానికి నమస్కరించి 11సార్లు ప్రదక్షిణ చేసి కుండభస్మము నొసట ధరించి దేవతాప్రసాదమును స్వీకరించవలెను.**

## - దేవతా ఉద్వాసనము -

గచ్ఛ గచ్ఛ భవత్ స్థానం కార్యం కృత్వా శ్రీ షోడశీ పరదేవతా
యత్ర బ్రహ్మాదయోదేవాః నవిదుః పరమం పదం॥

అని చెబుతూ హోమకుండం నుండి దేవతకు ఉద్వాసన పలుకవలెను.

## - అగ్ని ఉద్వాసనము -

గచ్ఛ త్వం భగవన్ వహ్నే స్వస్థానం కుండమధ్యతః।
యత్ర బ్రహ్మాదయో దేవాః తత్ర గచ్ఛ హుతాశన ॥

అని చెబుతూ హోమకుండంలోని అగ్నికి ఉద్వాసన పలుకవలెను.

అనేన మయా కృతేన హోమేన శ్రీ షోడశీ పరదేవతా సుప్రసన్నా వరదా భవతు అని కుండములో నీళ్ళు అక్షతలతో కలిపి వదలవలెను.

**సువర్భువర్భూరోమితి దిగ్విమోకః** అని దిగ్విమోచనము చేయవలెను.

**దీనితో హోమవిధి పూర్తయింది.**

## హోమం చేసేటప్పుడు వాడే ప్రధాన వస్తువులు

**1. స్రువము :** చంద్రకొయ్యతో చేసిన చిన్నమూతిగల గరిటె ఒక మూరపొడవు గలది.

**2. స్రుక్కు:** చంద్రకొయ్యతో చేసిన పెద్ద మూతిగల గరిటె ఒక మూరపొడవు గలది.

**3. మృగముద్ర:** బొటనవేలు - మధ్య - ఉంగరపువేళ్ళు కలిపితే వచ్చేది. వీటి మధ్యలోకి ఎంత వస్తే అంత పరిమాణంతోనే ద్రవ్యాలను ఆహుతిగా వేయాలి. హోమం చేసేటప్పుడు ఆజ్యాన్ని, తైలాన్ని, స్రువంతో వేయాలి. నువ్వులు, అవాలు వంటి ఇతర పదార్థాలను మృగముద్రతో వేయాలి.



మృగముద్ర



స్రుక్కు - స్రువము

## లఘు హోమ పద్ధతి

**సంస్కృత భాషతో పరిచయములేనివారికి, క్లుప్తముగా హోమములు చేసుకోదలచిన వారికి ఇది ఉద్దేశించిబడినది.**

కాళ్ళు, చేతులు, ముఖము కడుగుకొని ఉతికిన గుడ్డలు కట్టుకొని తూర్పువైపుకాని, ఉత్తరము వైపుకాని తిరిగి, ఒక పీటపైకాని, ఆసనముపైకాని కూర్చుండవలెను. ఎదురుగా ఇటుకలతో చేసిన తాత్కాలిక కుండమును ఏర్పాటు చేసికొని ఉండవలెను. మీ ముందు జలపాత్రను పెట్టుకొని దానిలో ఉద్ధరిణవేసి ఒక ఆకుతో నీటిని త్రిప్పుతూ "బ్రహ్మ,విష్ణు, మహేశ్వరులారా! సముద్రములారా! భూదేవతా! గంగ, యమున, గోదావరి, కృష్ణ మొదలగు నదులారా! ఈ నీటిలో ప్రవేశించి తీర్థములుగా మార్చవలసిందని ప్రార్థిస్తున్నాము. అని నమస్కరించండి. తరువాత...

ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి, ధియోయోనః ప్రచోదయాత్. ఓం అపో జ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ అని చెప్పండి.

**ధ్యానం:**

నా కోరిక సిద్ధించుట కొరకు శ్రీ షోడశీ మంత్ర హోమము చేయుచున్నాను. శ్రీ గురుభ్యోనమః అని గురువులకు నమస్కరించి మూలమంత్రమును స్మరించుచు కలశములోని నీరు కొంచెము తీసుకొని కుండములో చల్లవలెను. అదేవిధముగా పసుపు, కుంకుమ, అక్షతలు, పూలు దానిలోవేసి **"శ్రీ షోడశీ పరదేవతా హోమకుండాయ నమః"** అని హోమకుండమునకు నమస్కారము చేయవలెను. కుండము యొక్క అంచుల మీద **8** దిక్కులయందు అక్షతలతో ఈ క్రింది మంత్రములు చెప్పుచూ పూజించవలెను.

1. తూర్పు – అగ్నయే నమః
2. ఆగ్నేయము – హుతవహాయ నమః
3. దక్షిణము – హుతాశినే నమః
4. నైఋతి – కృష్ణవర్త్మనే నమః
5. పడమర – దేవముఖాయ నమః
6. వాయవ్యము – సప్తజిహ్వాయ నమః
7. ఉత్తరము – వైశ్వానరాయ నమః
8. ఈశాన్యం – జాతవేదసే నమః

**అగ్నిపీఠపూజ :**

కుండము లోపల దశ(10) దిక్కుల యందు అక్షతలతో పూజించవలెను.

1. తూర్పు - ఓం పీతాయై నమః
2. ఆగ్నేయ - ఓం శ్వేతాయై నమః
3. దక్షిణం - ఓం అరుణాయై నమః
4. నైఋతి - ఓం కృష్ణాయై నమః
5. పడమర - ఓం ధూమ్రాయై నమః
6. వాయవ్యం - ఓం తీవ్రాయై నమః
7. ఉత్తరం - ఓం విస్ఫులింగిన్యై నమః
8. ఈశాన్యం-ఓం రుచిరాయై నమః
9. ఊర్ధ్వము - (ఈశాన్యము - తూర్పు మధ్య) ఓం జ్వాలిన్యై నమః
10. అధోదిక్కు- (నైఋతి-పడమర మధ్య) ఓం రం సర్వశక్తి కమలాసనాయ నమః

**ఆసన పూజ :**

**"రం వహ్న్యాసనాయనమః"** అని అగ్ని ఆసనమునకు నమస్కరించవలెను.

**అగ్ని జ్వలనము :**

హోమకుండంలో చిన్న కట్టెముక్కలు, పిడకల ముక్కలు వేసి, వానిపై కర్పూరముపెట్టి అగ్నిని ముటించవలయును. **8** సార్లు **'ఓం'**కారమును ఉచ్చరించి అమృత బీజమగు **'వం'** మూడుసార్లు ఉచ్చరించి **'రం'** అను అగ్నిబీజమును **7** సార్లు ఉచ్చరించి **'రం వహ్ని మూర్తయేనమః** అనుచూ మంటలోనికి అగ్నిదేవుడు దిగినట్లుగా భావించి నమస్కరించవలయును.

కుడిచేతిలో నీళ్ళుపోసుకొని కుండము చుట్టూ **'హుంఫట్'** అని పలుకుచూ అగ్నిచుట్టూ రక్షాకవచము నిర్మించినట్లు భావించుచు నీరు పోయవలెను.

మండుచున్న కట్టెపుల్లలో నుండి ఒకపుల్లను తీసి **హూంఫట్ క్రవ్యాదేభ్యః స్వాహా** అనుచూ నైఋతి దిక్కున వేసి దానిని రాక్షసులకు అర్పించినట్లు భావించవలెను.

అగ్నిదేవుడు పూర్తిగా అవతరించి అనుగ్రహించుట కొరకు ఈ మంత్రములు చదువవలెను.

1. భూర్భువస్సువరోం
2. హ్రూం వహ్నిచైతన్యాయ నమః
3. చిత్పింగళ హనహన దహదహ పచపచ సర్వజ్ఞ అజ్ఞాపయ స్వాహా.

4. క్రీం క్రీం జ్వలజ్వల ప్రజ్వల ప్రజ్వల హుం ఫట్‌స్వాహా.
5. ఓం వైశానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయస్వాహా.
6. అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం, సువర్ణ వర్ణమమలం సమిద్ధం విశ్వతోముఖం – **అని అగ్ని దేవునకు నమస్కరించవలయును.**

**పంచ పూజలు :**

**ఓం –** **అగ్నయేనమః** పాద్యం సమర్పయామి,
అర్ఘ్యం సమర్పయామి, ఆచమనం సమర్పయామి
అని ఉద్ధరిణెడు నీళ్ళు మూడుసార్లు కుండములో వేయవలెను.

**లం –** పృధ్వీతత్వాత్మికాయ నమః – గంధం ధారయామి
అని తడి గంధమును చల్లవలెను.

**హం –** ఆకాశతత్వాత్మికాయ నమః – పుష్పైః పూజయామి
అనుచు పూలు వేయవలెను.

**యం –** వాయుతత్వాత్మికాయ నమః – ధూపమాఘ్రాపయామి
అని అగరువత్తితో ధూపము చూపించవలయును

**రం –** తేజస్తత్వాత్మికాయ నమః – దీపం దర్శయామి
అనుచు దీపమును వెలిగించి చూపించవలయును.

**'ధూప దీపానంతరం ఆచమనం సమర్పయామి'**
అనుచు ఒక చుక్క నీరు వేయవలెను.

**వం –** అమృత తత్వాత్మికాయ నమః 'నైవేద్యం సమర్పయామి'
అనుచు మధుర పదార్థములను / సున్నుండ / పండ్ల ముక్కలు
శ్రీషోడశీ మంత్రము చదువుచూ సమర్పించవలెను.

ఎదురుగా నేతిపాత్రను పెట్టుకొని దర్భతో కుండములో దానిని కాల్చి ఆ మంటను నేతిలో ప్రతిఫలింప చేయవలెను. ఆహుతులు వేయుటకు **'స్రుక్కు'** (కొయ్యతోచేసిన పెద్ద మూతిగల పొడుగాటి గరిటె) **స్రువము** (కొయ్యతో చేసిన చిన్న మూతిగల చెంచావంటిది) ఉపయోగించవలెను.

పాత్రలో నుండి స్రువముతో కుడిప్రక్క నుండి నేతిని తీసికొని **'ఓం అగ్నయే స్వాహా'** అని ఆహుతి వేయవలెను. ఎడమభాగము నుండి నమః అని తీసికొని **'ఓం సోమాయస్వాహా'** అని ఆహుతి వేయవలెను. మధ్య నుండి తీసికొని **ఓం అగ్ని సోమాభ్యాం స్వాహా** అని ఆహుతి వేయవలెను.

మరల కుడివైపు నుండి **నమః** అని తీసుకొని **ఓం అగ్నయే స్విష్ట కృతే స్వాహా** అని ఆహుతి వేయవలెను. మధ్యనుండి నేతిని తీసుకొని

1. ఓం భూః స్వాహా
2. ఓం భువః స్వాహా
3. ఓం సువః స్వాహా
4. ఓం భూర్భువస్సువః స్వాహా

అని ఆహుతులు వేయవలెను.

**"ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయస్వాహా"**

అని **3** సార్లు ఆహుతులు వేయవలెను.

**ఈ క్రింది మంత్రములతో ఒక్కొక్క ఆహుతిని వేయవలెను.**

1. ఓం అగ్నిజిహ్వేభ్యః స్వాహా
2. ఓం జిహ్వాధిదేవతాభ్యః స్వాహా
3. ఓం షడంగదేవతాభ్యః స్వాహా
4. ఓం అష్టమూర్తిభ్యః స్వాహా
5. ఓం అష్టమాతృకాభ్యః స్వాహా
6. ఓం అష్టభైరవేభ్యః స్వాహా

**7. ఓం అష్టదిక్పాలకేభ్యః స్వాహా**

స్రువముతో **4** సార్లు నేతిని తీసికొని స్రుక్కునందు వేసి దానిపై ఒక పువ్వు నుంచి స్రువమును దానిపై బోర్లించి **"ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ వౌషట్"** అనుచు ఆహుతి వేయవలెను.

**ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనంమే వశమానయ స్వాహా స్వాహా** అనుచు ఒక ఆహుతి వేయవలెను.

**శ్రీ గురుభ్యోనమః స్వాహా** అని గురువును స్మరించుచూ ఒక ఆహుతి వేయవలెను.

**'ఓం హ్రీం సిద్ధగురోర్ప్రసీద హ్రీం ఓం"** అని **11** ఆహుతులు స్వాహాంతముగా వేయుట అధిక ఫలదాయకము.

**ఓం శ్రీ షోడశీ పరదేవతా యోగపీఠాయ నమః స్వాహా** అనుచూ ఒక ఆహుతి వేయవలెను.

ఆ తరువాత శ్రీషోడశీ మూల మంత్రాన్ని **10** సార్లు ఉచ్చరించుచూ దేవతను అగ్నియందు అవతరింప చేయవలెను. ప్రాణప్రతిష్ఠా మంత్రము పురశ్చరణ చేసినవారు దానిని ఉపయోగించవచ్చును.

అగ్ని, ఇష్టదేవతల ముఖము ఒకటి అగుటకు శ్రీ షోడశీ మంత్రముతో **25** ఆజ్యా ఆహుతులు స్రువముతో వేయవలెను. ఇద్దరు దేవతలనాడులు ఒకటి అగుటకు **11** ఆజ్యా ఆహుతులు శ్రీ షోడశీ మంత్రముతో వేయవలెను.

ఇప్పుడు దేవత అగ్నిలోకి అవతరించినది కనుక పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము సమర్పించవలెను. నైవేద్యమును శ్రీషోడశీ మంత్రము చెప్పుచూ స్వాహా అనుచూ అగ్నిలో వేయవలెను.

పిమ్మట శ్రీషోడశీ మంత్రముతో 10 ఆహుతులు వేయవలెను. స్రుక్కు, స్రువములేనివారు ఉద్ధరిణలు వాడవచ్చును.

ఇప్పుడు సాధకులు తన ప్రయోజనమును అనుసరించి తగిన వస్తువులతో హోమము చేయవలెను.

శ్రీం హ్రీం క్లీం ఐం సౌః - ఓం హ్రీం శ్రీం - క ఏ ఈ ల హ్రీం హ స క హ ల హ్రీం - స క ల హ్రీం - సౌః ఐం క్లీం హ్రీం శ్రీం స్వాహా ।

అని పై మూలమంత్రానికి స్వాహా చేర్చి ఉచ్చరిస్తూ ఆహుతులు వేయవలెను. చేయదలచుకొన్న ఆహుతుల సంఖ్య పూర్తయిన తరువాత ఈ క్రింది మంత్రములతో మహావ్యాహృతి హోమము చేయవలెను.

